


సంపుటము 45

సంచిక 20

**7.1-53**

సచిత్రవారపత్రిక

**Founder : K. NAGESWARA RAO**

179

నందన పుష్య బహుళ సప్తమి బుధవారము




గిండీ రాజభవనంలో రాష్ట్రనిర్మాణ వ్యవహారంపై అర్థగంట చర్చల అనంతరం
ప్రధాన మంత్రి నెహ్రూ శ్రీ ప్రకాశ పంతులుగారు

# విషయానుక్రమణిక



## రచయితలకు మనవి

మాకు కథలు, గేయాలు, చిత్రాలు, ఫోటోలు పంపేవారు వానిని త్రిప్పి పంపగోరినట్లయితే, రచనలూ చిత్రాలతోపాటు అవసరమైన స్టాంపులను గాని, స్టాంపులు అంటించి చిరునామా వ్రాసిన కవర్లనుగాని చేర్చి పంపవలసిందని మనవి. స్టాంపులను పంపేవారికి మాత్రమే వారి రచనలను గాని, చిత్రాలనుగాని ప్రచురించేముందు ప్రచురణ విషయమై తెలియపరచగలము. ఈ సందర్భంలో రచయితలు, చిత్రకారులు మాకు సహకార మివ్వగలరని ఆశిస్తున్నాము.

## మిత్రభేదం
### (బొమ్మల కథ)

లోగడ ఆంధ్రపత్రిక సచిత్ర వారపత్రికలో సీరియల్‌గా ప్రకటింపబడిన 'మిత్రభేదం' బొమ్మల కథ త్వరలో పుస్తకరూపంలో వెలువడనున్నది.

—సంపాదకుడు

# కాలక్షేపం

క్షమచే గాదవమాన మోర్చుట;
  మహాసంతుష్టిచే గాదు గే
హమునం దైన సుఖంబు మానుట;-
  తపోవ్యాసక్తిచే గాదు దు
ర్గమ శీతోష్ణజయంబు;-
  కాదు హరుపై ధ్యానంబు; విత్తంబుపై;-
నమరెన్ మాకు మునీంద్రకృత్యములు;
  లే, వా సత్ఫలాభ్యున్నతుల్.

తా॥ అవమాన మోర్చుకొనుచున్నప్పటికీ అది క్షమ అనేటటువంటి రాగద్వేషాదిరహితమైన నిశ్చల మానసికావస్థవల్ల కాదు. ఇంటిలోని సంసారసుఖమునుకూడా మానుకొని వ్యవహరించుచుండినప్పటికీ, అది ఆశారహితమైన ఆత్మసంతుష్టిచేత గాదు. తీవ్రమైన ఎండకు చలికి భయపడకుండా వాటిని జయించి తిరగడం ఆత్మపరిపక్వంకొరకై తపస్సు చేయవలెననే ఆసక్తిచేత గాదు. తదేకధ్యానంబుతో వ్యవహరించుచుండినప్పటికీ, ఈ ధ్యానం అంతా అయిశ్వర్యంకొరకే గాని, యీశ్వరునికొరకు గాదు. మునీంద్రులకు ఉండే చేష్టలు మాయందు అమరియున్నవి. కాని, ఆ మునీంద్రులచర్యలవల్ల వారికి కలిగెడి సత్ఫలిత విశేషములు మాత్రము మాకు లేవు.

ఏ ఫలితమైనా, కష్టపడితేనే లభిస్తుంది. "కృషితో నాస్తి దుర్భిక్షం జపతో నాస్తి పాతకం"—పాటుపడి వ్యవసాయం చేస్తే కఱవు దారిద్ర్యం పోతుంది. తపస్సు చేస్తే పాతకములు నశిస్తాయి. ఇవి రెండున్నూ చిరకాలంనుంచీ ఒక్కటే జంటనీతిగా లోకంలో ప్రచారం అవుతున్నాయి. కనుక పాడిపంటలకోసం ఎండనక వాననక పొలములలో తపస్సు చేసినట్లుగా పాటుపడి ఆ భూములనే నమ్ముకొని సొంతవ్యవసాయం చేసినవాళ్లకు, తాతలనాటి మెట్టభూములన్నీ పల్లపు సాగులోనికి వచ్చి, బంగారుతీగెలు, ఢిల్లీభోగాలు, పండుతున్నాయి. యకరానికి నాలుగు పుట్లుచొప్పునకూడా అవలీలగా పండించుటకు వీలైన ఎరువులు కరవుతీర వచ్చాయి. వరికి ధర హెచ్చి ఎవరికీ అందకుండా తారాపథం అంటుతోంది. యుద్ధానికి పూర్వము మద్రాసునగరంలో శేరు 1 కి మూడణాలు ఉన్న ధర యిప్పుడు శేరు 1 కి ముప్పావలా అయింది. నాలుగురెట్లు పెరిగింది. బియ్యంధర ప్రస్తుతం నాలుగో శ్రుతిలో ఉన్నదని యెంచినట్లయితే, కొ కాలంలో ఆరో శ్రుతికికూడా అందుకోగలదు. అప్పుడాధర తారకంలో పలుకుతున్నదని చెప్పవచ్చు. శేరు 1కి రూ 1-2-చా॥ బియ్యంఅమ్మినరోజున, బియ్యం ధయుద్ధాత్పూర్వంకంటె పెరిగిపెరిగి తారపథంలోకి వెళ్ళినదని తప్పక చెప్పవచ్చు. రైతులు చేసే కృషిని రైతులు లోపంలేకుండానే చేస్తున్నారు. కాని "కృషితో నాస్తి దుర్భిక్షం" అనేమాట ప్రత్యక్షప్రమాణంగా కన్పించడంలేదు. అందువల్ల కేవలము కృషివల్లనే దుర్భిక్షం తొలగిపోదు అనే అనుమానం చాలాకాలంక్రిందటనే పెద్దవాళ్లకు కలిగింది.

వర్షాలు అసలు కురవకపోయినా, వర్షాలు అమితంగా కురిసినా పంటలు పాడైపోతాయి. అంతేకాదు. కురిసెడి వర్షాలు కూడా సకాలంలో కురవక, అకాలవర్షాలు కురిస్తే పంటనష్టం చాలా ఉంటుంది. అటువంటి పరిస్థితులలో దేశానికి ఏదో పాతకం, అరిష్టం చుట్టుకొన్నదనిన్నీ భగవంతునకు ప్రార్థనలు చేయవలెననిన్నీ పూర్వులు నిర్ణయించారు. వర్షాలు కురియకపోతే విరాటపర్వపారాయణం చేయవలెనన్నారు. వర్షాలు కురియకపోతే సహస్రఘటాభిషేకం చేయవలెనన్నారు. నవగ్రహ యజ్ఞాలుకూడా చేయవలెనన్నారు. వరుణదేవుణ్ణి ప్రార్థించవలెనన్నారు.

1952 సం॥ లో మద్రాసునగరంలోను నగరసమీపంలోనూ వర్షం కురవదేమో అని నగరవాసులు దిగులుపడ్డారు. కాని దైవానుగ్రహమువల్ల వర్షం బాగానే కురిసింది.

మద్రాసునగరములోని కుళాయీలద్వారా నగరవాసులు త్రాగడానికి తగినంత సమృద్ధిగా నీరు సప్లయికాగలదు. కుళాయిలకు నీరు సప్లయిచేసేటటువంటి రెడ్‌హిల్సు చెరువు బాగా పూర్తిగా నిండింది. అందుకు మద్రాసునగర పురపాలక సంఘమువారు ఆనందభరితులైనారు. వర్షము బాగా కురిపించినందుకై భగవంతునకు కృతజ్ఞతా వందనములను సమర్పిస్తూ మద్రాసు నగర పురపాలకసంఘమువారొక తీర్మానం చేశారు. కాబట్టి, వర్షం కురిపించినటువంటి దేవునకు కృతజ్ఞతా నమస్కారములు చేయడం అవసరమని మద్రాసు నగర పురపాలక సంఘ సభ్యులు అంగీకరించారు. అటువంటి సందర్భములో, వర్షములను కురిపించవలసినదిగా దేవుణ్ని ప్రార్థించడం కూడా మన విధ్యుక్తధర్మమని అంగీకరించాలి. "భగవంతుణ్ని ప్రార్థిస్తే వర్షం కురుస్తుందా?" అని శంకించేవాళ్లు, వర్షం కురిసిన తర్వాత "భగవంతుడా ఈ వర్షపాతం అంతా నీ అద్భుత మహిమ" అనే తీర్మానంకూడా చెయ్యనక్కరలేదు. కనుక, కేవలం నాగలి చేతబట్టి సాగుచేసినంత మాత్రంచేత కర్షకుడు చేయవలసిన కృషి పూర్తి కాదు. వర్షం కురియవలెనని మొఱపెట్టుకుంటూ, మనస్ఫూర్తిగా భగవంతుణ్ని ప్రార్థించాలి. ఇదికూడా కృషిలో భాగమే—నాగలిపట్టి పొలం దున్నడం ప్రారంభించింది మొదలుకొని, విత్తనాలు నాటడంవరకూ నిర్విఘ్నంగా పని జరుగవలెనని ముందుగా విఘ్నేశ్వర పూజ చేసికోవాలి—

విత్తనాలు నాటేటప్పుడు ఒకసారి భగవద్ధ్యానం చేసికోవాలి. వర్షం కురవడానికి తిరిగి తపస్సు చేయాలి. పంట సరిగ్గా పండితే గుళ్ళో దేవునికి పాతిక కొబ్బరికాయలుకొట్టి ఊళ్ళోపిల్లలందరికీ ఆ కొబ్బరిముక్కలూ బెల్లం కలిపి పంచిపెడ్తానని మ్రొక్కుకోవాలి. పంట బాగాపండిన తర్వాత ఆ పంటధాన్యానికి సరియైన ధర ఉండాలి. ఈ సంవత్సరం సంక్రమణ పురుషుడు (సంక్రమయ్య) ఏ ధాన్యానికి మంచి ధర యిప్పిస్తాడో ఏ ధాన్యాన్ని నాశనం చేస్తాడో ఎవరికి తెలుసు? కాబట్టి ఆ సంక్రమణ పురుషుణ్ని ఒక చిన్న ప్రతిమగాచేసిపెట్టుకొని, యీ సంవత్సరపు ఆర్థిక వ్యాపార ప్రతిబంధకపూర్వకమైన కష్టనష్టములను రానీయకుండా రక్షించవలసినదిగా కర్షకులందరూ, వస్తు ఉత్పత్తిదారులందరూ, వ్యాపారస్థులందరూ, భగవంతుణ్ని ఆ రూపేణ ధ్యానంచేసికొని ప్రార్థన చెయ్యాలి. ఉత్తరాయణం ప్రవేశించిన యీ జనవరిమాసం నుంచీ కొత్త పంట సరకులు సప్లయి కావడం, వ్యాపార సంవత్సరము ప్రారంభంకావడం, ఆయావస్తువుల ధరల వడిదుడుకులు ఎట్లా ఉంటాయో అని వ్యాపారస్థులు ఆందోళన చెందడం సహజం. ఈ మకరసంక్రమణంతో వారికీ ఆతురత సంక్రమిస్తుంది. అందువల్ల ఈ సంక్రమణ పురుషుని రూపంలో భగవంతుని ధ్యానం చేయాలి. ఈ విధంగా కర్షకుడైనవాడు అనుక్షణం, దైవీక రాజీక సంబంధములైన వడిదుడుకులపాలు కాకుండా గట్టెక్కడంకోరకున్నా, తాపట్టినది బంగారం, తాముట్టినవి ముత్యాలు అగుటకోరకున్నా భగవంతుణ్ని ధ్యానం చేస్తూ ఉంటాడు. ఏడుకొండలవానికి ఎన్ని మ్రొక్కులైనా చెల్లించుకుంటాడు. గంగానమ్మకు పోతేరమ్మకు పూజలు చేయిస్తాడు. తన వ్యవహారాలన్నీ సలక్షణంగా సానుకూలమైతే, లాభాలు లక్షణంగా ఉంటే, సత్యనారాయణవ్రతంచేసి సంతర్పణచేస్తాడు. దీని అంతరార్థం ఏమిటి? తనకు వచ్చిన లాభైశ్వర్యంలో కొంతభాగమును తనతోపాటు పదిమంది లోకులుకూడా అనుభవించి, ఇష్టమృష్టాన్నములతో సంతుష్టాంతరంగులయ్యేటట్లు చేస్తాడు. తన లాభైశ్వర్యముఅంతా స్వలాభ స్వప్రయోజనార్థం కాదనిన్నీ, దానిని యితరులకు అనగా లోకానికి త్యాగంచేస్తాననిన్నీ. వ్యాపారస్తుడు ఒప్పుకొని ఆ ప్రకారంగా చేస్తాడు. యథాశక్తిగా త్యాగం చెయ్యడం అనేది ప్రతి సంసారియున్నూ సాధకం చేస్తేనే తప్ప, అతని సంసారం జయప్రదంగా కళకళలాడుతూ వృద్ధిలో ఉండదని సంసారియైనవాడు అంగీకరించక తప్పదు. ఈ త్యాగబుద్ధివల్లనే, ఈ ధర్మబుద్ధివల్లనే, ఈ పుణ్యచింతవల్లనే, తాను వృద్ధిలోనికివచ్చి, తనకు బిడ్డలూ పాపలూ కలిగి, వాళ్లందరూ సుఖంగా ఆయురారోగ్యాలతో ఉంటారని గృహస్థు ఆశయం. అది మన పెద్దల నిర్ణయం. అదే మన జీవితపద్ధతిలో ఉన్న మంచి సంప్రదాయం. కనుక, మన స్వలాభ కృషి పరోపకారచింతతో లంకె వేయబడింది. మన ఆర్థిక ప్రయోజనాలు పారమార్థిక చింతతో ముడివేయబడినాయి.

కనుక, చిట్టచివరకు మనకు లెక్కతేలే మొట్టమొదటి సారాంశం ఏమిటంటే, మనలో త్యాగబుద్ధి ఎక్కువైన కొద్దీ మనంవృద్ధిలోనికివచ్చి బాగుపడతాము. త్యాగి అయినకొద్దీ గృహస్థుకు దశ ఎత్తుకుంటుంది. అక్కడే ఉంది అసలైన చిక్కు. గృహస్థు అయినవాడు త్యాగియై, మరింత త్యాగియై, మహా త్యాగియై, సర్వసంగ పరిత్యాగి అయినట్లయితే, ఆ గృహస్థుకు ఎత్తుకొనే ఉత్తమదశ ఏమిటి? సన్యాసి అవుతాడు. కాని, సన్యాసి కావాలని గృహస్థు కోరడు.

తన భార్య ప్రసవించలేక రోజంతా నొప్పులు పడుతూఉంటే చూచి భరించగలడా? ఆమెతోబాటు తానుకూడా ఆవేదన పడ్తాడు. "ఈ గండం గడచి పిండం బయటపడితే, స్వామీ! తండ్రీ! నిలువుదోపు యిస్తానని ఏడుకొండలవానికి మ్రొక్కుకోవే!" అంటాడు భార్యతో. అప్పుడు వెంకటేశ్వరస్వామికి దీపారాధన చేసి ఆమె మొక్కుకుంటుంది. చక్కని మొగబిడ్డ పుట్టి పురిటినీళ్లు పోసికొని, ఒళ్లో బిడ్డనెత్తుకొని, గుళ్ళో అభిషేకం చేయించి, తన ఒంటిమీదఉండే వెండి బంగారు ఆభరణాలన్నీ స్వామికి సమర్పించి వస్తుంది. అంతటితో మొక్కు తీరదు. అబ్బాయికి పుట్టువెంట్రుకలు అక్కడే తీయించి నున్నగా చలిమిడిసుద్దలాగున బోడిగుండు చేయిస్తారు. తల్లికూడా తన నీలాలు యిచ్చివేసి, తన అలంకారములలో అన్నింటికంటె శిరోభూషణమైన దగిన శిరోజములను కత్తిరించివేసి, క్రాపింగుకూడా పెట్టుకొనకుండా పూర్తిగా ముండనము చేయించి ముసుగువేసికొని తిరుపతినుంచి తిరుగుప్రయాణమవుతుంది. భర్తకూడా భార్యతోబాటు పూర్తిగా సాయిబ్బుగారివలె, శంకరస్వాములవారివలె "కేశలేశములేదు కేశవా! – దోసమెంచకు నన్ను కేశవా!" అని సంకీర్తన చేసుకుంటూ స్వామికి సాష్టాంగ ప్రణామాలు చేస్తాడు. భార్య చూలాలైనప్పుడు ఆమె పెన్నేరితీరున పెంచిన జీడిమామిడి గింజ కీడు జోడన జాలు దాడి కూడ వాడి మాడి ఊడిన బోడి సాహెబు జాతనున్న ఆ కోడె వయసు కాడు, ఆ బోడినన బోడి యింటి వాడు, "నా భార్యా, నా బిడ్డా, నేనూ ఈరోజువరకు సుఖంగా ఉన్నాము. అంతేచాలు. అదే మాకు పదివేలు" అని ఆనందిస్తాడు. "మొట్టకొడితే నేమిరా? మరి జుట్టు పెడితే నేమిరా?" అనే వేదాంతసారం వారికి దక్కింది. "అన్నమైతే నేమిరా, మరి సున్నమైతే నేమిరా?" అనే చరణంలోకి యింకా రాలేదు. సన్యాసిని కాలేదు కాని, సర్వాభరణాలు అమ్మగారికి పోయినాయి. పదివేల రూపాయీల సొమ్ములు పరమానందంతో యిచ్చివేసింది. కాషాయ వస్త్రాలు లేకపోయినా, ఘోషాయికైనా సులభసాధ్యంకాని సువర్ణ శిరోజత్యాగం చేసింది. తాను ఎంత త్యాగంచేస్తే భగవంతుడు అంత సంసారసుఖం తనకు యిస్తాడనే నమ్మకం కలిగింది.

సామాన్యంగా గయా పుణ్యక్షేత్రమునకు వెళ్లినటువంటివారు అక్కడ తనకు



# కాలక్షేపం



అత్యంత ప్రీతికరమైనది ఏదైనా విడిచి పెట్టి త్యాగం చెయ్యాలి. బుద్ధగయ అనేది దాని సమీపంలోనే ఉంది. బుద్ధుడు మొదట మహారాజు కుమారుడు. రాజ్యానికి వారసుడు. తన రాజ్యాన్నీ, సౌందర్యవతియైన భార్యను, ముద్దు పసిబిడ్డను, అర్ధరాత్రి వేళ రాజమందిరమందు నిద్రపోవుచున్న సమయంలో విడిచిపెట్టి, ఈ బుద్ధగయకువచ్చి ఒకమర్రిచెట్టుక్రింద కూర్చుండి తపస్సుచేసి మహాజ్ఞానియైనాడు. భిక్షమెత్తుకొనుచూ యింటింటికి తిరిగి లోకానికి జ్ఞానోపదేశం చేశాడు. తనభార్య వద్దకు కూడా వెళ్లి తన భిక్షాపాత్రలో తనకు భిక్ష వేయుమన్నాడు. ఆ రాజకుమారునియొక్క కన్నబిడ్డచేతనే భిక్ష వేయించింది. అటువంటి మహాత్యాగి తపస్సుచేసిన పుణ్యస్థలం ఇది. జ్ఞానసిద్ధి పొందిన పవిత్రక్షేత్రం అది. గయాక్షేత్రమునకు వెళ్లిన యాత్రికులు యథాశక్తిగా త్యాగం చెయ్యడం నేర్చుకోవలెనన్నారు. అత్యంత ప్రీతికరమైన వస్తువును దేనినైనా గయాక్షేత్రంలో విడిచిపెట్టాలి. కొబ్బరికాయను త్యాగంచేసినట్లయితే ఆ కాయను ఇక యావజ్జీవము రుచిచూడకూడదు. అటువంటి నియమంతో ఉండాలి. ఎవరెంతటి త్యాగంచేస్తే వారికంతటిపుణ్యం ఉంటుంది. ఒకప్పుడు ఆంధ్రదేశంనుంచి భార్యాసమేతంగా ఒక వృద్ధగృహస్థు గయకు వెళ్లాడు. ఆ క్షేత్రంలో అక్కడి వటవృక్షంవద్దకు ఎందరెందరో వచ్చి అనేక భోగములను వర్జిస్తూ త్యాగదీక్షాప్రమాణములు చేయడం యీ ఆంధ్రదంపతులు చూచారు. మిగిలినవారందరికంటె ఎక్కువత్యాగం తాను చూపవలెననే అభిలాషతో, తనకు ప్రాణంతో సమానమైన తన భర్తనే త్యాగంచేస్తానని ప్రమాణం చేసింది. అంటే విడాకులుగాని, దాంపత్య విచ్ఛేదంగాని కాదు. తన భర్తతో సంబంధించిన భోగానుభవమును తాను పూర్తిగా వదలుకుంటానన్నది. భార్యనే త్యాగంచేస్తానని భర్త ప్రమాణంచేశాడు.

ఆ విధంగా యీ ఆంధ్రదంపతులు తమ దాంపత్యభోగమును విసర్జించి, తలలు బోడులుచేసికొన్న సన్యాసులు కాకపోయినా, తలపులబోడులై ఇంటికి మరలి వచ్చారు. ఎందుకట్లా త్యాగంచేశారని యిరుగుపొరుగువాళ్లు ప్రశ్నిస్తే, ఆ పురాణ దంపతులు ఒక్కటేజవాబు చెప్పారు. "ఈ పసుపుకుంకమతో ఆయనా, నేనూ పదికాలాలపాటుఉంటే అంతే చాలు, భగవంతునిదయవల్ల" అని ఆ ఇల్లాలు జవాబు చెప్పింది-"ప్రొద్దునలేవగానే యీ పండుముత్తయిదువ నాకంటికి కనిపిస్తూ నన్ను కనిపెట్టిఉంటే, నాయింటికి అదే అలంకారం—అదే లక్ష్మి. నేను ఏ త్యాగంచేసినా దానికోసమే"అన్నాడు ఆ గయాతీర్థపుణ్యం మూటగట్టుకొనివచ్చిన గృహస్థు. "భలే మోహనరంగా! మల్లెపూలా తెప్ప మీదా తేలిపోదము గదరా!" అనే పహిలాపచ్చీసు నాయికానాయకు లెంత ఖులాసాగా కాలక్షేపం చేస్తారో, "గయలో గార్హస్థ్యసౌఖ్యం గయా!"అని స్వగృహానికి తిరిగి వచ్చిన యీ దంపతులుకూడా అంత సంతోషంగా జీవయాత్ర చేస్తున్నారు. మీదు మిక్కిలి ఇంకా హైస్థాయిగా హాయిగా కాలక్షేపం చేస్తున్నారు.

ఈ విధంగా సంసారంలో మనశ్శాంతి కావాలనిన్నీ, ఒడిదుడుకులు లేని నిరంతర నిశ్చలానందం కావాలనిన్నీ తీవ్రంగా, గాఢంగా, దీక్షగా కోరేటటువంటివాడు దానికోసం పడవలసినపాట్లు అన్నీ పడతాడు. ఎండనక, వాననక, ఎన్నిపాట్లయినా, పడతాడు. అంతేకాదు. పూర్తిగా భోగలాలసుడైనవాడు కూడా అటువంటి పాట్లు పడతాడు. ఉరుములు, మెరుపులతో హోరున వర్షం కురుస్తోంది. పిడుగులు పడుతున్నాయి. కన్ను పొడుచుకున్నా, మిన్ను మన్ను కన్పించని కటికచీకటి రాత్రి - ఇంట్లో తండ్రి మరణశయ్యమీద ఉన్నాడు. తన భార్య ఒక్కతె ఒంటరిగా అక్కడ శవజాగరం చేయవలసిన స్థితిలో ఆమెను దిగవిడిచి, బిల్వమంగళుడు సరాసరిగా ఆ వానలో, ఆ అర్ధరాత్రి చీకటిలో చింతామణియింటికి (తాను ఉంచుకున్న వేశ్యయింటికి) బయలుదేరి వెళ్లాడు. చింతామణి యింటిగేటు బంధించి ఉంది. ప్రాకారపు గోడమీద తాడువలె ఏదో చేతికి చిక్కితే దానిని పట్టుకొని గోడదాటి ఆవరణలోపలికి ప్రవేశించాడు. అతడు దేనిని పట్టుకొని గోడ ఎక్కాడో, అది త్రాడు కాదు. పాము అని తర్వాత తెలిసింది. మహారణ్యంలో అన్నాహారములు వర్జించి పాములమధ్యను, క్రూరమృగాలమధ్యను తపస్సుచేసేవాడు కూడా యింత తీవ్రంగా యింతదారుణంగా తన ప్రాణాన్ని దేహాన్ని నిర్లక్ష్యం చేయడు. ఇదంతా దేనికోసం? తాను మనసుపడిన వనితను, తన ఎదలోని మదవతిని, తాను వలచిన కులటను చేరి కేళీవిలాసంగా ఉండడం కొరకే. తాను ఎదైనదానికోసం, ఎత్తయిన గోడలెక్కి దుమికినాడు, "అచ్చుపోసిన యాబోతు ముచ్చదోప". తాను కోరిన కోరిక యీడేరవలెననే కాంక్షతో, యింత సంకల్పబలం చూపించాడు. తనకోరికను చిట్టచివరకు చింతామణి యీడేర్చ లేదనుకోండి. అతనిని ధిక్కరించి, తిరస్కరించి, తృణీకరించి తరిమివేసిందనుకోండి. అప్పుడిక కాముకుడు చేసే పనులు రెండుమూడు విధాలుగా ఉంటాయి. (1) తానే ఆత్మహత్య చేసుకుంటాడు. లేదా (2) దానినే హత్య చేస్తాడు. లేదా (3) దానిని హత్యచేసి తానుకూడా ఆత్మహత్య చేసుకుంటాడు. ఎందుచేత? (1) ఇదివరకే తన శరీరాన్ని అమితవర్షమనక, అంధకారమనక అనేక విధాల శ్రమపెట్టి శోషింపజేశాడు. ఇక దానికి పూర్తి పర్యవసానం ఏమిటంటే, ఆ జీవుణ్ని పూర్తిగా శోషింపజేసి నిశ్శేషం చేయడమే. ఈ బిల్వమంగళుడనే జీవునకు ఈ శరీరం ఉండడంవల్లనే, ఆ జీవునకు ఈ శరీరంమూలంగా బాధ కలుగుతోంది. కనుక ఈ శరీరంలో ఆ జీవుడు లేకుండా చెయ్యాలి. (2) ఇంతకాలంనుంచీ తనకీ అవస్థలన్నీ కల్పించినట్టి చింతామణి అనే వ్యక్తి లేకపోయినట్లయితే, ఈ బిల్వమంగళుని మనస్సుకు యింత వ్యథ కలుగకుండా ఉండేది. కనుక చింతామణినే అంతమొందించాలి. తప్పటడుగులు వేసేటటువంటి చిన్నపిల్లవాని కాలికి గడప తగిలి బోర్లగిల పడినట్లయితే, "పాడుగడప!

# ★ కాలక్షేపం ★

కొయ్యగడప! ఛోరా! నా అబ్బాయిని ఎందుకు పడగొట్టినావు?" అని ఆ గుమ్మమును తల్లి రెండు దెబ్బలు కొట్టినతర్వాత పిల్లవానికి ఏడ్పు పోతుంది. తాను తప్పటడుగులు వేస్తే, అందువల్ల తన కాలికి గడప తగిలితే, తప్పెవరిది? గడపయందే తప్పున్నదనిన్నీ, దానినే దండించవలెననిన్నీ పిల్లవాని పిచ్చిఊహ. బిల్వమంగళునివంటి విటుని కపటువెగటు వలపు తలపులు కూడ ఇట్టివే.

ఇంతకూ, విటుడుచేసే తపస్సుకున్నూ, యతిచేసే తపస్సుకున్నూ తారతమ్యం ఒక్కటే కన్పిస్తుంది. కామియైనవాడు ఏదో ఒక కోరిక కోరుతూ ఉంటాడు. ఆ సంకల్పం సిద్ధించడంకోసం తపస్సుచేస్తూ ఉంటాడు. మోక్షకామియైనవాడు తనకు కోరికలనేవి లేకుండా ఉండవలెనని ఒక్కటే పెద్దకోరిక కోరుతూ, ఆ కోరిక అనగా "కోరిక కాని కోరిక" సిద్ధించవలెనని తపస్సుచేస్తూ ఉంటాడు. కామికిన్నీ, మోక్షకామికిన్నీ యిదే అసలైన, సిసలైన వ్యత్యాసం.

పూర్వ మొకప్పుడు ఇద్దరు పొలము కాపులు ఇరుగుపొరుగు స్నేహితులుగా ఉండేవారు. ఇద్దరూ అన్నదమ్ములే. పెద్దవానిపేరు కిట్టప్ప- చిన్నవానిపేరు సిద్ధప్ప - పెద్దవానికి అనగా కిట్టప్పకు (కృష్ణప్పకు) ఒక యోగి ఉపదేశం చేశాడు. "నీవు ఏ పనిచేసినా సరే, "కృష్ణార్పణం!" అని చేసి, ఆ కార్య భారం అంతా "స్వామీ! నీదే" అని ఆ కృష్ణపరమాత్మునకే సమర్పించు. "తలపెట్టిన పని ఏమి అవుతుందా?" అనే వ్యాకులం పెట్టుకోవద్దు అని కిట్టప్పకు ఆ యోగి ఉపదేశించి వెళ్లిపోయినాడు. సిద్ధప్ప ఒక సిద్ధునివల్ల ఉపదేశం పొందాడు. "సిద్ధప్పా! నీవు ఏపనిని తలపెట్టినప్పటికీ, నీవు ఏ పనిని ప్రారంభించినప్పటికీ, నన్ను తల్చుకొని ధ్యానం చేసుకో. ఈ మంత్రం జపించుకో! నీ కోరిక తప్పక సిద్ధిస్తుంది." అని ఆ సిద్ధుడు సిద్ధప్పకొక మంత్రం ఉపదేశించివెళ్లాడు. ఒకయేడుయిద్దరు అన్నదమ్ములూ వేర్వేరు చిక్కుడు పాదులుపెట్టి పందిళ్లువేశారు. సిద్ధప్ప తనగురువును స్మరించుకొని, ఆయన చెప్పినమంత్రం జపించి గింజలు నాటి గింజలన్నీ చక్కగా మొలకలెత్తవలెనని ప్రార్థించాడు. ఆ ప్రకారంగానే అవి అన్నీ మొలిచాయి. వాటికి సిద్ధప్ప బాగా నీళ్లుపోసి, మంత్రం జపించి 'జయ్ సద్గురూ!' అన్నాడు. ఈ మొక్కలన్నీ బాగా విస్తరించి పాకవలెనని సంకల్పించాడు. అవి అన్నీ ఆ ప్రకారంగానే అల్లుకొని విస్తరించాయి. ఆ తీగలన్నీ బాగా పూవులు పూయవలెనని తిరిగి సంకల్పించి గురుమంత్రం జపించాడు. తీగలన్నీ చక్కగా పూచినవి. "జయ్ సద్గురూ! ఇవన్నీ పిందలు అయి, గుత్తులు గుత్తులుగా కాయలు కావాల"న్నాడు. అతని సంకల్పం నెరవేరింది. ఆపువ్వులూ ఏడుకాయలుగా గుత్తులు గుత్తులుగా కాయలు కాచాయి. ఇక సిద్ధప్ప కోరిక సిద్ధించింది. ఇక సద్గురు మంత్రంతో పని లేదని యోచించి సద్గురు స్మరణ నిలిపివేశాడు. ఆరాత్రి ఒక దొంగ గేదె ఎవరిదోగాని, సిద్ధప్ప పెరటిలో ప్రవేశించి ఆ చిక్కుడు పాదును చక్కగా పిందెలతో కాయలతో సహా హాయిగా మేసి వెళ్ళిపోయింది. కృష్ణప్ప చిక్కుడు గింజలు నాటిననాడే భగవంతుని ధ్యానం చేసికొని "కృష్ణార్పణం!" అని నేలలో వేశాడు. "ఈగింజలను నీవు ఏమి చేసినా సరే! ఆగింజలు నీవే - ఆగింజలవల్ల వచ్చే చిక్కుడుకాయలోని గింజలూ నీవే! అంతా నీ సంకల్పానుసారం జరుగవలసిందేగదా!" అని కిష్టప్ప భగవంతుని ధ్యానంచేశాడు. దానికి పొయ్యవలసిన నీళ్లు ప్రతిరోజూ "కృష్ణార్పణం!" అని పోస్తూనే ఉన్నాడు. అవి మొలకలెత్తినవి. వాటికి పందిర వేశాడు. తన శరీరంలో శక్తిఉంటే నీరుపోసేవాడు లేకపోతే "ఆ పాదును కృష్ణార్పణం!" అన్నట్లుగా విడిచిపెట్టి, తన నులకమంచంమీద కంబళీ ముసుగుపెట్టుకొని పరుండేవాడు. కిష్టప్ప పాదు ఏపుగానే ఎదిగింది. బాగా కాపునకు వచ్చింది. ఎప్పుడు కోసినా అరవీశెడు కాయలకు తక్కువలేకుండా "కృష్ణార్పణం!" అని కోసి, కూతురుచేతికిచ్చి అమ్ముకొని రమ్మనేవాడు. "అడుగడుగునకు మాధవా యను"నట్లుగా కిష్టప్ప అడుగడుగునకు "కృష్ణార్పణం!" అంటూ కాలక్షేపం చేస్తున్నాడు. ఒక సంకల్పంకోసం ప్రత్యేకంగా భగవద్ధ్యానం చేయడం అతని తత్వం కాదు. సంకల్పం అనేదికూడా భగవంతుడు కలుగజేయవలసినదేగాని అది మన సంకల్పం కానేకాదు. ఈ జగత్తు అంతా ఆయన సంకల్పం ప్రకారంగా సంచరిస్తుందిగాని, మనసంకల్పం ప్రకారంగా సంచరించేదికాదు. ఈ జగత్తు అంతా మనం సృష్టిచేసింది కాదుగనుక, మన సంకల్పానుసారం సంచరించేదికాదు. అందుచేత సంకల్పించడం, ఆ సంకల్పమీడేరడంకోసం సర్వేశ్వరుణ్ని ధ్యానించడం, సంకల్పంసిద్ధించకపోతే, సర్వేశ్వరుణ్ని శంకించడం, లోకులను శపించడం, తనకు తాను శపించడం, ఇదంతా ఎందుకు సంభవిస్తోంది అంటే, తాను అజ్ఞానియైయుండి, జ్ఞానినని నటించడంవల్ల - తాను తమస్సులో ఉండి, తపస్సులో ఉన్నానని భ్రమించడంవల్ల. కనుక "సంకల్పమేటికో మనసా!" అని మనిషియైనవాడు నిమిషాని కొకసారియైనా, ఒంటి తీగ తంబురా మీటినా మీటకపోయినా, నోటినిండా అనుకోవడం మంచిది.

ఘోరయుద్ధాలు చేసినటువంటి జర్మను నియంత హిట్లరుకూడా భగవత్కటాక్షంవల్లనే యుద్ధం చేయగల్గుతున్నానని చెప్పుకొన్నాడు. ఫ్రాన్సును జయించడానికి మాసం పట్టునని తాను అంచనా వేసుకొంటే, వారంరోజులలోనే జయించడం తటస్థించిందన్నాడు. ఇదంతా ఈశ్వర సంకల్పంవల్లనే జరిగిందన్నాడు. నిజం- ముమ్మాటికీ నిజం. చివరకు జర్మనీ ఓడిపోవడం, హిట్లరు అనే వ్యక్తి నామరూపాలు లేకుండా పోవడం, ఇదంతా కూడా యీశ్వరసంకల్పప్రకారమే జరిగింది. కనుక, శత్రువుతో యుద్ధం చేసేటప్పుడు కూడా "కృష్ణార్పణం" అనిచేయుమన్నారు. లేదా "హర! హర! మహాదేవ్!" అనిచేయుమన్నారు. "నేను జయించాలి" అనే సొంత సంకల్పంకూడా త్యజించి పని చెయ్యాలి. "జయించేది నేనుకాదు - ఈశ్వరసంకల్పమే జయిస్తుంది. జయ్! జయ్! మహాదేవ్!" అనాలి.

గృహస్థాశ్రమంలో ఉండి తన ఆలుబిడ్డలకోసం, వారి కూడుగుడ్డలకోసం, గృహస్థు ఎంత తపిస్తాడో, ఎన్ని దేవుళ్లకు మ్రొక్కుకుంటాడో, ముక్తికాంతకోసం యోగికూడా అంత తపస్సు చేస్తాడు. అయితే, గృహస్థు తన స్వజనంకోసం, అనగా, భార్యాబిడ్డలుకొరకుమాత్రమేగాక, సొంత అన్నదమ్ములకోసం, తలిదండ్రులకోసం, అక్కచెల్లెండ్రకోసం, ఖాసా (సొంత) మేనమామలకోసం, ఖాసా మేనత్తలకోసం, సయాం (స్వయం) బావమరదులకోసం, ఒక వేలు విడిచిన జ్ఞాతి సోదరులకోసం, రెండువేళ్ళు విడిచిన వియ్యంకుళ్ళకోసం, దశరాత్రాలవాళ్ళకోసం, మూడురాత్రిళ్ళవాళ్లకోసం, బాద

(11-వ పేజీ చూడండి)

# వెలుగు నీడలు

(గది దృశ్యం. సాధారణమైన అలంకరణ. రెండు పాత కుర్చీలు. గోడకు ఆనించి వున్న ఓ టేబిలూ. ఎదురుగా తెరిచివున్న తలుపు. ఎడమవైపున మూసివున్న ద్వారం. జానకి: వయసు; యిరవై. కుర్చీలో కూర్చుని వుంటుంది; దీర్ఘాలోచనలో వున్నట్టు కనబడుతుంది. కృష్ణారావు: భర్త, ముప్పై ఏళ్లు. హడావిడిగా వస్తాడు.)

జానకి: ఏమండీ! ఆఖరి నిమిషంలో ఐనా, మేనమామల యింటికి వెళ్లడానికి ఒప్పుకుందా?

కృష్ణారావు: ఊహుఁ! (ఆగి) అయినా, భర్త పోయాడని తెలిసి కూడా మొహం చూపని వాళ్లింటికి ఏ మొహం పెట్టుకుని వెళ్తుంది!

జా: ఐతే మరి...మరి ఎక్కడికి టికెట్ కొనుక్కుంది?

కృ: తెనాలికి.

జా: (తొందరగా) అక్కడికి వెళ్లి ఏం చేస్తుంది? ఎవరున్నారక్కడ? మరీ అంత మతి లేకుండా ప్రవర్తించడం...మీరైనా ఎందుకు చెప్పలేకపోయారూ?

కృ: (నిర్వేదంగా) ఏమని జానకీ? ఆఁ!...ఏమని?

జా: (మాట్లాడదు. తల వంచుకుంటుంది.)

కృ: (గద్గదికంగా) యింతే జానకీ, బ్రతుకులే యింత!

జా: (బరువుగా) ఊఁ!

కృ: (చకచకా; ఖంగుమనే గొంతుతో) యీ లోకంలో కొందరు పుట్టడమే ఓ పాపం! చేసుకున్న పాపం కొద్దికీ పుడతారు; మళ్ళీ పాపం చేసే చస్తారు. అంటే మళ్ళీ అంతా మొదలు, పునశ్చరణ. రామారావే పుట్టకపోతే... లలితకు యీనాడు యీ వైధవ్యం, నా అనేవాడు లేని స్థితీ, దమ్మిడీ చేతులో లేని దీనదశా...(తడబడుతూ) నీకూ లలిత స్థితే కలిగితే ఏం చేస్తావ్ జానకీ?

జా (ఏడుస్తూ) అయ్యో! వూరుకోండి. అలాంటిమాట లనకండి! నా మనస్సేమీ బాగోలేదు.

కృ: (అనునయంగా) చూడు. మనం వాస్తవాలనుంచి పలాయనం చేయలేం. మనిషికి యింగితజ్ఞానమనేది వరమే కాక, శాపం కూడా. వారం రోజుల క్రిందటి వరకూ రామారావనే వ్యక్తి యీ యింటి పక్కభాగంలో వుండేవాడు. నా స్నేహితుడు; తోటి గుమాస్తా కూడా. కాని యీనాడు...

జా: (కీచుగొంతుతో) వూరుకోండి! మీ పుణ్యముంటుంది, వూరుకోండి!

కృ: వూరుకోలేను జానకీ వూరుకోలేను. యింకా రెండుమూడు గంటల టైం మాత్రమే వుంది. నువ్వు క్షమించినా క్షమించలేకపోయినా చెప్పి తీరాలి. తప్పదు.

జా: ఏమన్నారు? ఏమంటున్నారు?

కృ: ఏదీ జానకీ, ఏదీ...నీ చెయ్యి యిటివ్వవూ! నా మొహంలోకి చూడు... నా కళ్లల్లోకి...

జా: అయ్యో, ఏం చేశారు? ఏం జరిగింది? చెప్పండి...ముందు చెప్పండి! త్వరగా! ఊఁ.

**శ్రీ దాసరి సుబ్రహ్మణ్యం**

కృ: చెప్తాను జానకీ, చెప్తాను! కాని నువ్వు శాంతంగా వినగలవా? నీ ప్రేమకు అర్హుణ్ణయిన నేను; క్షమకూడా అర్హుణ్ణని గుర్తిస్తావా?

జా: చంపక...చెప్పండి? (బ్రతిమాలుతూ) ఏం చేశారు?

కృ: (నిబ్బరంగా) క్రిందటి ఆదివారం నువ్వూ - నేనూ, లలితా - రామారావూ బీచి వొడ్డున కూర్చున్నాం. మీరు, చీరెలూ నగల్నీ గురించీ, మధుబాలా నర్గీస్‌ల సౌందర్యాన్ని గురించీ మాట్లాడుకొన్నారు. మేం...రామారావూ నేనూ బ్యాంకిలో మావుద్యోగాల్ని గురించీ, రాబోయే యిం(క్రి)మెంట్లను గురించీ మాట్లాడుకున్నాం. కాని యీనాడు రామారావు యీ ప్రపంచంలోనే లేడు. లలిత విధవ. పుట్టింటి తరఫు. నా అనే దిక్కు లేని...

జా: అవన్నీ నేను వినలేను. మీరేం చేశారో చెప్పండి! చెప్పరూ?

కృ: అదే చెప్పబోతున్నాను. రామారావు మరణం, లలిత దీనస్థితీ, నీనా భవిష్యత్తూ...అన్నీ, నన్ను, అది చేయవలసినస్థితికీ, చేయకతప్పని స్థితికీ లాగినై. అందుకే యీనాడు నీ హృదయంలో నాకు ప్రేమకే గాక, క్షమించేందు కూడా స్థానం యివ్వాలి.

జా: (వెక్కిలి: నిశ్వాసం)

కృ: మరణం అనివార్యం అవడంలో కన్న, అది హఠాత్తుగా, పొంచి వుండి కొట్టే దెబ్బలోనే ఎక్కువ విషాదం వుంది. రామారావుకన్న నేను ఎక్కువ ఆరోగ్యవంతుణ్నేమీ కాదు. అసలు మృత్యువు పిచ్చిదు కక్కా. దానికి ఏజీవి ఆరోగ్యానారోగ్యాలతో పని లేదు. ఒకవేళ నేనే రేపు...

జా: (ఏడుస్తూ) చెప్పండి! ఏం చేశారు? ఊఁ...

కృ: అదే...అదే చెప్పబోతున్నాను జానకీ! యిటు చూడు. తలెత్తు. రామారావు లలితకు దమ్మిడీ మిగల్చకుండా పోయాడు. అక్కడా యిక్కడా చేసిన చిల్లర బాకీలు తప్ప! నా అని ఆదుకునే వాడెవడూ లేని లలిత యిప్పుడెలా బ్రతుకుతుంది? కూలి నా? పిడకలమ్ముకునా? లేక...

జా: నన్ను చంపేస్తున్నారు! నాకు పిచ్చెత్తుతోంది!

కృ: కలవరపాటు లేకుండా శాంతంగా విను జానకీ! రామారావుది తిరిగిరాని ప్రయాణం; కాని, నేను కొంత ఆలస్యంగా ఐనా తిరిగొస్తాను. నువ్వుమాత్రం నాకోసం ధైర్యం చిక్కబట్టి వుండాలి. నన్నపార్థం చేసుకోవు గద!

జా: అపార్థం చేసుకునేందుకు మీరేం చేశారు? చెప్పండి...

కృ: నా ఎనభైరూపాయిల జీతం ఎంత పెరిగినా నూరుకన్న ఎక్కువ కాదు. రామారావు కన్న మనకు అధికంగా వున్న ఆస్తి యీ పూరికొంప. అనుకోగూడదు... అయినా నేనూ అలా హఠాత్తుగా పోవడం అంటూ జరిగితే నీ స్థితీ లలిత కన్న ఏమీ భిన్నంగా వుండదు. ఏ యింట్లోనో వంటలక్కగా బ్రతకవలసి వస్తుంది. నాతరవాత నీకు తప్పనిసరిగా కలగబోయే ఆ దీనదశ...ఏ లోకంలో వున్నా నా ఆత్మకు శాంతి వుండదు. అందుకని...

జా: (పొడిగొంతుతో) అందుకని... ఏం చేశారు! ఏం చేశారు?

కృ: క్షమించు. ఏవీ నీ చేతులు... యింకా దగ్గరకురా! నీ భవిష్యత్తూ... నా భవిష్యత్తూ గురించి కూడా ఎంతో ఆలో



చించే...బ్యాంకు డబ్బు యిరవై వేలు కాజేశాను.

జా: (కుప్పలా కూలిపడుతుంది).

కృ: లే. ధైర్యం తెచ్చుకో. నాకోసం... యీ సరికి బ్యాంకి తెరిచివుంటారు. యింకాసేపటిలో పోలీసులు తయారుకావొచ్చు. బహుశా నేను ఏ ఏడెనిమిది సంవత్సరాలకో తిరిగొస్తాను. వున్న టైంకొద్ది! విను! జాగర్తగా విను! ఆ యిరవై వేలలో చాలా కొద్దిమాత్రమే ఖర్చయింది. ఎవరో ఒకరు ప్రతినెలా నీకు యాభైరూపాయలు పంపుతారు. పక్క గదిభాగం అద్దెకిచ్చేయ్. తర...

జా: ఆపండి!! మీరు యింతకన్న నా గొంతు కోసినా బావుండేది! మీదారిన మీ రెళ్ళండి. నేనూ ఏ నుయ్యో చూసుకుంటాను.

కృ: (గాద్గదికంగా) జానకీ, ఈ సమయంలో నాకు ధైర్యం కలిగించవూ! నన్నాదుకోవూ!...చూడు! లలితా - నువ్వూ ఎంత ఆప్యాయంగా వుండేవాళ్లు! మరి...లలితకు ఈ కష్టసమయంలో అండగా నిలబడటం మన బాధ్యత కాదూ? నేను చేసింది పొరపాటే కావొచ్చు! కాని...అది నీకోసం, నాకోసం, లలిత కోసం; అందరికోసం తప్పనిసరై చేశాను.

జా: (దీనంగా) అంత తప్పనిసరి ఏమొచ్చింది చెప్పండి? లలితకు ఏదిక్కూ లేదు గనక సహాయం చేయాల్సిందే. ఆఖరి నిమిషంలో ఐనా మేనమామల యింటికి వెళ్ళేందుకు అంగీకరిస్తుందనుకున్నాను. లేకపోతే యీ కొంపైనా తాకట్టుపెట్టి ఎక్కడో ఓచోట ఏ నర్సు ట్రెయినింగ్ అయినా చెప్పించేవాళ్ళం.

కృ: లలితకోసమే యింతదుస్సాహసం చేశాననుకుంటున్నావా జానకీ!

జా: మరెందుకు చేశారు? నాకోసమా. మీరు జైల్లో పడివుంటే నేను బయట... యిరవై వేల రూపాయిలతో కులుకుతూ కాలం గడుపుతాననుకున్నారా!

కృ: అది చాలాదూరం ఆలోచించి చేసిన పని జానకీ. రామారావులాగే ఏ నిమిషాన్నో నేనూ హఠాత్తుగా పోతే నీ గతేం కావాలి?

జా: అలా అని మీరు మీ వూహల్లో కల్పించుకున్న భయంతో చేసే వుద్యోగం పోగొట్టుకుని జైలుపాలైతే, నా గతేం కావాలి?

కృ: (ఒకటీ ఒకటీ రెండూ; అన్న ధోరణిలో) అన్నీ ఆలోచించాను. మంచి - చెడూ అంతా ఆలోచించాను. నే చేసేది గవర్నమెంటు వుద్యోగం కాదు. ఏ నిమిషాన్నైనా వాళ్లు పనిలోనుంచి తీసేయాలంటే తీసేయొచ్చు. ఒకవేళ ఓ పాతిక సంవత్సరాలు యిదే వుద్యోగం చేసినా... ఆ ముసలితనం వచ్చేసరికి బ్రతికేందుకు ఈ జీతంతో దమ్మిడీకూడా మిగల్చలేం. ఎవరో



భార్య: "అబ్బబ్బ ఎట్లా! చచ్చేదండీ వీడితో! నాకు వచ్చిన పాటలన్నీ పాడినా వీడింకా నిద్రపోవటం లేదు. ఎల్లాగండీ?"

భర్త: "మంగళం కూడా పాడిచూడు. వాడందుకోసమే గోలచేస్తున్నాడేమో!"

కరుణించాలి; లేక కుళ్ళికుళ్ళి చావాలి. అన్నిటికన్న... నేనూ యీ లోపతే రామారావులా నిన్ను అనాధను చేసిపోవొచ్చు.

జా : యింతెందుగ్గాని. ఆ డబ్బెక్కడ దాచాగో చెప్పండి. ఏగో విగంగా తిరిగి బ్యాంకీలో కట్టేద్దాం.

కృ : అది సాధ్యమయ్యేదికాదు జానకీ! యిప్పుడు డబ్బు కట్టినా వుద్యోగంపోవడం ఖాయం. యింతజరిగాక వాళ్ళిక నమ్మరు. (చెవియొగ్గి విని).

అదుగో ఎవరో వస్తున్నారు. పోలీసులే కావొచ్చు. యిక నేను చెప్పగలిగిందేమీ లేదు. నన్ను క్షమించు. (ఆగి, మెల్లిగా) ఒక్కటిమాత్రం బాగా గుర్తుంచుకో. ఏ పరిస్థితుల్లోను...ఏ పరిస్థితుల్లో ఐనా సరే, ఈ యిల్లు అమ్మబోకు.

 # వెలుగుచీకట్లు 

(దూరంనుంచి కేక; కృష్ణారావుగారున్నారా ?)

కృ : నువ్వు అవతల గదిలోకిపో జానకీ. నాగేంద్రంలావుంది. (మూసివున్న ద్వారం తెరుస్తాడు.)

కృ : ఎవరు......నువ్వా నాగేంద్రం. లోపలికి రా!

నా : (నంగిగా) ఏమిటి దంతా?

కృ : మేనేజరొచ్చాడా?

నా : మేనేజరొచ్చాడు. పోలీస్ స్టేషన్ కూడా కబురుపోయింది. డబ్బేమైనట్టూ!

కృ : గుర్రప్పందేల్లో పెట్టాను నాగేంద్రం! గుర్రప్పం...దేలలో!

నా : అంత డబ్బూ!

కృ : ఆఁ! అక్కడక్కడ కొంత బాకీ కూడా చేసి.

నా : ఐతే, యిప్పుడు జరగవలసింది...

కృ : అదే ఆలోచిస్తున్నాను. అన్ని వేలు కాదుగదా అన్ని వందలైనా కట్టగలిగిన శక్తి నాదగ్గిర లేదు. యీ యిల్లమ్మినా రెండూ మూడు వేలకంటే ఎక్కువరాదు. పైగా యిది నా భార్య ఆస్తి. దాని తల్లిదండ్రుల్నించి సంక్రమించింది.

నా : ఐతే ఏమైయ్యేట్టూ!

కృ : అదే...అదే!

నా : క్యాషియర్‌వి కదా! బాధ్యతగలవాడివి కదా...అన్ని వేలు ఆ గుర్రప్పందేల్లో ఆలోచన లేకండా ఎలా పెట్టావ్! ఘోరం!

కృ : ఒకటి రెండు వేలు అన్నీ ఆలోచించే గెలుస్తుం దనుకున్న గుర్రంమీద కాయడం జరిగింది. అదెప్పుడైతే ఓడిందో యిక తతిమ్మాదంతా అదృష్టం మీద భారంవుంచి గుర్రమా - గాడిదా అని కూడా చూడకుండా పెట్టేశాను.

నా : మీ ఆవిడేమంటుంది! ఐదారు సంవత్సరాలకు తక్కువ శిక్షపడదు!

కృ : మంచిలాయర్ను పెట్టుకుంటే...

నా : ఏమని ఆర్గ్యూ చెస్తాడు ?

కృ : మతి చాంచల్యంవల్లా... మనస్తిమితం తప్పడంవల్లా...

నా : గుర్రప్పందేలమీద సర్దా కలిగిందనా! నువ్వెంత ప్రమాదకర పరిస్థితుల్లో వున్నావో తెలుసుకున్నట్టులేదు.

కృ : తెలుసుకున్నా గనకనే టైం ఐనా ఆఫీసుకు రాలేదు, నాగేంద్రం యిప్పుడేం చేస్తే బావుంటుంది!

నా : ఎకైనా పారిపో.

కృ : గెలుస్తానన్న నమ్మకంతో; పారిపోయిందు కూడా డబ్బు మిగుల్చుకోకుండా కాసేశాను.

నా : యింతకీ మీ ఆవిడేది ? ఏమని చెప్పావ్.

కృ : దానితో అయ్యేదేమీ లేదుకనక, నిజమే చెప్పాను.

నా : తలబాదుకోలా ?

కృ : నేనే ముందు బాదుకోవడం సాగించాను.

నా : నీధోరణిచూస్తే, యింకా నువ్వు రాబోయే ప్రమాదాన్ని గుర్తించినట్టు లేదు. రామారావే గనక బ్రతికున్నట్టయితే నీకిలాంటి దురాలోచనలు కలిగేవి కావు.

కృ : (జాలిగా) అవును. అతను చాలా దూరాలోచనలున్న మనిషి. కాని...

నా : కానీ, ఏంటి కృష్ణారావ్. (తగ్గస్థాయిలో) నేను, నిన్ను కోప్పడేందుకూ, నీతులు చెప్పేందుకూ రాలేదు. వుద్యోగరీత్యా, వయసులో, నీకన్న ఎంత సీనియర్ నైనా, నిన్ను చెడా-మడా విమర్శించే హక్కు నాకుం దనుకోవడం లేదు. నువ్వు చేసిన పనిలోని మంచి చెడ్డల్ని ఏదో ఓనాడు నీ హృదయమో, కాలమో స్పష్టమైన విలువలు కట్టి తెలియచేస్తయ్. పోతే, యిప్పుడు జరగవలసింది...

(హారన్ మోత వినబడుతుంది.)

అదుగో! బహుశా పోలీసులే కావొచ్చు! నే వెళతాను. అన్నీ సర్దుకో. నీ భార్యకు ధైర్యం చెప్పు. నీ మనస్సులోని బలహీనతల్ని జయించేందుకు ప్రయత్నించు. ఆర్థిక సమస్యల్ని పరిష్కరించుకునేందుకు నువ్వనుసరించిన మార్గం, యీనాడూ—ఏనాడూ కూడా సరైంది కాదు. ఆలోచించు. వస్తాను. (వెళ్తాడు)

(దగ్గర్లో కారు ఆగిన ధ్వనీ, వెంటనే టక్‌టక్ మనే బూట్లమోతతో పోలీసు యిన్‌స్పెక్టర్ వస్తాడు. వనక పోలీసూ, మరొకరూ.)

పోలీసు యిన్‌స్పెక్టర్ : ఎవరు ? మీరేనా...నువ్వేనా కృష్ణారావు?

వంటవచ్చినతను : అతనేనండీ! అతనే, యిన్‌స్పెక్టరుగారూ !

పో. ఇ : ఎక్కడోయ్! కారెక్కు. ఊఁ !

కృ : వస్తున్నానండీ! జానకీ!

జా : (ఏడుస్తూ వస్తుంది.)

కృ : (బతిమాలుతూ) నే చెప్పాను

కదూ! ధైర్యంగావుండు. ఊఁ! సరేనా. వస్తాను. క్షమించు. అపార్థం చేసుకోకు. మళ్ళీ వస్తాగా?

[అంతా వెళ్తారు. జానకి ఆవైపుకేచూస్తూ చీరకొంగుతో కళ్లుతుడుచుకుని, చప్పున ఎదురుగావున్న ద్వారంగుండా లోపలికి పోతుంది.]

## 2-వ రంగం

[అదే గది దృశ్యం. ముప్ఫైఏళ్ళ వయసులో వున్న జానకి, కుట్టుమిషనుమీద పని చేస్తూవుంటుంది. ఎవరో తలుపుతట్టిన శబ్దం.]

జా: (లేస్తూ) వస్తున్నా! ఎవరూ?

[తలుపు గడితీస్తుంది. లలిత వస్తుంది. జానకి వయసే.]

జా: నువ్వా లలితా! ఎంతకాలానికి చూశాను!

లలిత: అవునే జానకీ...చాలా కాలానికి! అన్నయ్యొచ్చాడా?

జా: యిప్పుడే, నాలుగ్గంటల ఎక్స్‌ప్రెస్‌లో వస్తారు. యివ్వాళే వస్తాడని నీకెలా తెలిసింది?

ల: యిక్కడికి రమ్మని టెలిగ్రాం యిచ్చాడు. (మిషన్‌కేసి చూసి) చూడు! చొక్కాలు కుట్టేంత పనిదానవైయ్యావా

జా: చొక్కాలేం ఖర్మ, కావాలంటే సూట్లుకూడా కుడతాను. సరేగాని.. ఆ చొక్కా ఎవరికో చెప్పచూతాం.

ల: (నవ్వుతో) ఎవరికా? ఆఁ!...... అన్నయ్యకు, యింతా కష్టపడి కుడుతున్నావ్! పాపం ఎంతచిక్కిపోయాడో!

జా: చిక్కిపోవడమే! ఆయన రాసిన వుత్తరాలు చూస్తాంటే...యింత లావ్వూ, యింతఎత్తూ ఐపోస్తాడనుకుంటాం. ఎంత వుత్సాహంగా, ఎంత హాస్యంగా రాశేవాడూ!

ల: అదీ యిప్పుడే చూస్తాంగాం (ఆగి) పక్కభాగం ఎవరికీ అద్దెకిచ్చినట్టుగా లేదు?

జా: ఎవరికో ఎందుకు లలితా! చక్కా... నువ్వా యిక్కడ గవర్నమెంటు హాస్పిటల్‌కు ట్రాన్స్‌ఫర్ చేయించుకో. మెడ్రాస్ తరవాత యీ విశాఖపట్నం హాస్పిటలే పెద్దది. యిక్కడా లోగిళ్లా అందరం సాయంకాలం బీచికి......

ల: (రుద్ధస్వరంతో) బీచీ!...బీచీ! ఆ రోజులు జానకీ! ఆరోజులు!

జా: వూరుకో లలితా! పొరపాటైంది. అవన్నీ మర్చిపోదాం...అవన్నీ—

(గుర్రబ్బండాగిన శబ్దం అడుగుల చప్పుడు)

ల: అడుగో అన్నయ్య! అదుగో!! వస్తున్నాడు.

కృ: (వస్తూనే) జానకీ, ఏం లలితా! బాపున్నారు కదూ! నన్ను చూడండి! బాగా లావెక్కానుగదూ?

జా: (పొడిగొంతుతో) ఊఁ! లావెక్కారు!

కృ: చూశు లలితా! జానక్కి యీనాటివరకూ నామీద కోపం పోలేదు.

ల: నీ మీద కోపమేం టన్నయ్యా! నీకు చొక్కాకూడా తయారుచేస్తూంటే..

కృ: నిజంగానా జానకీ? ఏదో రవికెలూ అవి కుట్టేంతవరకే నేర్చుకునుంటూ వనుకున్నాను. నెలకెంత సంపాదనౌ స్తోంది?

జా: ఎంతోంత లెండి. ముందు మీరు స్నానానికి పదండి. కాఫీ యివ్వమంటారా?

కృ: కాఫీ యిద్దువుగాని...... చూడూ! నామీద ఏం కోపం లేదని నవ్వుతూ అను. యిక యీ జన్మకుయింకెంటి నీచపు పనిచెయ్యను.

ల: వచ్చేజన్మలో అలాంటిపని చెయ్యవలసిన అవసరంవుండదులే అన్నయ్యా! ప్రపంచం మారకుండా వుండదు.

కృ: నేనూ అనుకునేది అదే లలితా! నేను వున్నా లేక పోయినా జానకి యీ మాత్రం స్వతంత్రంగా, ధైర్యంగా బ్రతగ్గల దనుకున్నట్టయితే...అసలు ఆ ఘండాలప్పని చేసేవాణ్ని కాదు.

జా: నెలనెలా ఎవరిద్వారానో వచ్చిన ఆ యాభైరూపాయిల మొత్తమంతా మూటకట్టి ఆ పెట్టెలో వుంది. ఆ పాపపు డబ్బులోంచి ఒక్క దమ్మిడీ కూడా నేను తీసుకోలేదు. ఏయాభైకి ఆ యాభై విడివిగా పొట్లాలు కట్టివున్నయ్.

యివిగో తాళంచేతులు! మీరే తీసుకోండి!

కృ: విన్నావా లలితా! ఎంత నిష్ఠూరంగా మాట్లాడుతోందో జానకి!

ల: అంతా మంచిగానే జరిగిపోయిందిలే అన్నయ్యా! నేనూ యిక్కడికే ట్రాన్స్‌ఫర్ చేయించుకుంటాను.

కృ: అదే చెప్దామనుకుంటున్నాను. పక్కభాగంలో ఎవరుంటున్నారు జానకీ?

జా: ఎవ్వరికీ యివ్వలేదు. ఆనాటినుంచి అలాగే ఖాళీగా వుంది.

కృ: అలాగా...సరే! లలితా నీ దగ్గర ఆ ఐదు వేలలో ఏమైనా మిగిలిందా?

ల: ఆఁ! యింకా వెయ్యి రూపాయిల వరకూ వున్నయ్.

జా: (అనుమానంగా) ఐతే లలితా! ఆ యిరవై వేలూ కాజేసేముందే...ఆ సంగతి నీకు తెలుసా?

ల: ఇలాంటి అపోహ నీకు కలగొచ్చని అనుకుంటూ నేవున్నాను జానకీ. అన్నయ్య ఎదటే వున్నాడుగదా! అడుగు ఏం జరిగిందో.

కృ: అంతా నేనే చేశాను జానకీ! రైలుస్టేషను దగ్గిర టిక్కెట్టు కొని లలితకు యిచ్చిన తరవాతే అంతా చెప్పాను. ఆ ఐదు వేలూ; మెడ్రాస్‌లోనే ఎరిగివున్న డాక్టరుకు వుత్తరం, అప్పుడే యిచ్చాను. నీతో తెనాలికి టిక్కెట్టు కొనుక్కున్నదని అబద్ధం చెప్పాను. ఒకసారి డబ్బు దొంగిలించిం తరవాత; ఆ దుష్కలితా లన్నిటికీ తయారై తలవొగ్గాలిసిందే.

జా: తతిమ్మా పదిహేను వేలూ...

కృ: యిక్కడే వున్నయ్. నిన్ను, ఏ

మా తాతయ్యకు 80 ఏళ్లు వచ్చినా, ఆయన తానింకా 20 ఏళ్ళవాడే అయివున్నట్టు తిరుగుతూ వుండేవాడు.

ఒక రోజున ఆయన ఒళ్ళంతా బురద కొట్టుకొని యింటికి వచ్చాడు.

"అదేమిటి తాతయ్యా! ఒళ్లంతా అలా బురద అయిందేం? ఎక్కడన్నా పడ్డావా ఏం?" అని అడిగాను.

"అది కాదురా అబ్బాయ్! మన పుల్లావు తప్పించుకుపోయింది కదా; దాన్ని వెదుకుదామని బయలుదేరానురా. మన పొలానికి అవతల వున్న ఆ మడుగు మొన్న మొన్నటి దాకా, నేను యిట్టే దూకేసేవాడిని. అల్లాంటిది, ఆ మడుగు వున్నట్లు వుండి పెద్దది అయిందో ఏమో, నేనివ్వాళ ఎన్నిమార్లు దూకాలని ప్రయత్నం చేసినా, మడుగులోనే పడిపోయానురా; దాని దుంపతెగా!"

# వెలుగుచీకట్లు

పరిస్థితుల్లోనూ యిల్లమ్మవద్దని వెళ్ళేప్పుడు చెప్పాను. ఎందుకో తెలుసా?

జా: యిప్పుడు తెలుస్తోంది యిక్కడే ...ఎక్కడో దాచారు. అంతేనా?

కృ: దొడ్డివాకిలి తీయి జానకీ! ఎక్కడ దాచానో చెప్తాను.

ల: ఆగు జానకీ! అన్నయ్యా...బయట, అటూ యిటూ ఎవరన్నా వున్నారేమో ఓ మారు చూడు!

కృ: వున్నా ఏం ఫరవాలేదు. యిప్పుడు మనమేం తవ్వబోవడం లేదు.

జా: ఎక్కడ పాతేశారండీ? అమ్మో! ఎంత గజదొంగలండీ.

కృ: (ఎడమవైపు ద్వారం తెరిచి, కెవ్వమంటూ) దొడ్లో...వేపచెట్టేమైంది జానకీ?

జా. (తడబడుతూ) వేపచెట్టేమిటి?

కృ: వేపచెట్టు జానకీ! ఆడబ్బంతా దాని మొదట్లోనే పాతేశాను.

జా: (బాధగా) ఆ మధ్య గాలివానకు కొమ్మలన్నీ విరిగిపోయినై కూలీలను పెట్టి చెట్టు కొట్టేయించాను. మోడు కూడా తవ్వించాను. ఆ గుంట కూడా చూపెండి!

కృ: చూస్తున్నాను జానకీ! లలితా చూశావా?

ల: పోనీలే అన్నయ్యా! ఆ డబ్బుతో.. కూటికీ గుడ్డకూ మొహంవాచిన ఆకూలీలనే సుఖపడనీయ్. మనం చెడిపోయేదేమీ లేదు.

కృ: అంతేలే లలితా! అంతే...

జా: యికపదండి! వాళ్లూ వీళ్ళూ బ్యాంకీలో దాచుకున్న డబ్బుదొంగిలించి మీరూ, నేనూ ఆ పాప ఫలం అనుభవించాం. దొంగిలించిన సొమ్ముదొంగిలించి వాళ్లూ అనుభవిస్తారు.

ల: మనల్ని విధే శిక్షించిందన్నయ్యా!

కృ: నిజం!

ల: కాని, ఒక మేలుకూడా జరిగింది...

కృ: నిజం! (ఆగి) ఏమిటంటావ్?

ల: స్వతంత్రంగా ఎవరికివారు బ్రతికే శక్తి అందరం సంపాయించాం. జానకి గురించిన దిగులు నీ కవసరం లేదు. కుట్టుపని నేర్చుకుంది! నేను నర్సును!

కృ: నేను దొంగవాణ్ని! అంతేగదా జానకి...?

జా: (గద్గదికంగా) మిమ్మల్ని ఆదృష్టితో చూడగలనా? నాకోసం మీరు చేసిన త్యాగం! ఏవీ...మీకాళ్ళు పట్టుకోనీండి! నన్ను క్షమించరూ! (కాళ్ళమీద పడుతుంది.)

కృ: లే, జానకీ లే! ఈనాటితో నా హృదయం నిష్కళంకమైంది.

ల: ఏడవమాకు జానకి! అన్నయ్యకు మళ్ళీ వుద్యోగం దొరక్కపోయినా...ఏ ట్యూషన్లో రాకపోవు. నేనూ యిక్కడికే ట్రాన్స్ఫర్ చేయించుకుంటాను. చేయించుకోమంటావా?

జా: సాధ్యమైనంత త్వరగా రా లలితా! నీ సహాయం, తోడూ లేందే నాకు వుత్సాహంగా వుండదు.

ల: ఐతే నీ సహాయంకూడా నాకొకావాలి. సరేనంటే చెప్తాను!

జా: నా సహాయం ఏమిటి లలితా?

ల: మళ్ళీ ఈనాటికి సంవత్సరం తిరిగేప్పటి కల్లా, నువ్వు నాకో చక్కని మగపిల్లవాణ్ని కనివ్వాలి! మగపిల్లవాణ్ని!! గుర్తుంచుకో!

జా: చాల్లే వొదినా!

ల: వాణ్ని......యీ లోకంలో కళ్లు తెరిచీ తెరవడంతోటే ఎత్తుకపోతాను. పేరేం పెడతానో తెలుసా?

జా: ఊహుఁ! నాకు తెలీదు.

ల: అన్నయ్యకు తెలుసు....

కృ: అవును, నాకు తెలుసు! రామారావు!

(ముగ్గురూ నవ్వుతారు. అందులో ఆనందం - విషాదం కూడా.)

తెర.



# కాలక్షేపం

(5-పేజీ తరువాయి)

రాయణ సంబంధాలుగలవాళ్ళ కోసం, బీద కాయపీచు సంబంధాలవాళ్ళకోసం, నూనెలో ముఖం చూచుకోవలసిన పాత కాలపు బంధువులకోసం, ఇంటికి వస్తూ పోతూ ఉండడంచేత వద్దనలేని పెద్దవాళ్ళ కోసం, ఆత్మసోదరులకోసం, ఆలిసోదరుల కోసం, ఏ విధంగానైనా ఎండకుఎండి వానకు తడిసి, తాను జీర్ణించిఅయినా, తన ఖాసా జనానికి కావలసినది ఆర్జించి అర్పిస్తాడు. ధర్మరాజులవారు కూడా ఇదే మాట అన్నారు.

"సిరి నాకేలందువా?
గ్రాసవాసో దైన్యంబులు వచ్చు
నా యరయు నీ చుట్టాలకున్"

"సిరి నాకు ఏల అందువా?" అన్నారు. ఖాసాజనం కోసం, వారి గ్రాసవాసాల కోసం. (అన్నవస్త్రాలకోసం) సిరి (అనగా అయిశ్వర్యం) నాకు కావాలి - లేకపోతే సిరి నాకెందుకు?" అన్నాడు ధర్మరాజు.

అయితే, స్వబంధుమిత్ర పరివారజనం కోసం గాక, స్వసంఘంకోసం, స్వజాతి కోసం, పరితపించి పరితపించి, తపస్సు చేసే వాళ్ళుకూడా ఉన్నారు. వాళ్ళు లోక బాంధవులు-లోకులందరూ వారికి బంధువులు - "మానవసేవయే మాధవు సేవ" అనేటటువంటివాళ్లు నిర్వికల్పసమాధిలో కూర్చుండి తపస్సు చేసేవాళ్లు కారు. సంఘం బాగుపడాలి; సంఘసంస్కరణ చెయ్యాలి; హరిజనోద్ధరణ చెయ్యాలి; వితంతువులకు వివాహాలు చెయ్యాలి; సమస్త రస్తాలను విస్తరింపజెయ్యాలి; సమర్తాడితేనేగాని పెళ్లిళ్లు చెయ్యకూడదు, వ్యభిచారవీధుల మార్గాలు బందుచెయ్యాలి. మురుగుకాల్వల గొట్టాలు పట్టణాలలో పెట్టించి లోకాన్ని మరమ్మతు చెయ్యాలి. ఈ విధమైన లోకసంగ్రహార్థమైన సత్సంకల్పములు కొన్ని వీరికి ఉంటాయి.

ఈ విధమైన పరోపకారసేవ, లోకోద్ధరణచేస్తూ ముక్తి సంపాదించాలని కొందరు పాటుపడుతూ ఉంటారు. ఇట్టి త్యాగమూర్తులకు స్వార్థపరత్వం లేదు. ఖాసా జనలంపటం లేదు. వీరు గృహస్థులవలె ఆలుబిడ్డలకోసం తాపత్రయ పడరు. కాని, ఈ వానప్రస్థులు లోకం మరమ్మతు కోసం, ధర్మరక్షణకోసం, తాపత్రయ పడుతూ ఉంటారు. దేశంకోసం, జాతి కోసం, ప్రజాస్వామ్య సిద్ధాంతాలకోసం, సర్వసమత్వ సామ్యవాద ప్రచారవ్యాప్తి కోసం, మతప్రచారంకోసం, కొంత మమత వల్లడించి, శతమతమవుతూ ఉంటారు. వానప్రస్థులు, సిద్ధులు, సన్న్యాసులు మొదలైనవారు ఏదో ఒక సంకల్పంతో ధర్మసాధనచేస్తూ సర్వశక్తులను ధారపోస్తారు. ప్రాణాలైనా అర్పిస్తారు. కాని, ఒకమాట ఆలోచించాలి. ఈ జగత్తు అంతా ఎవరు నిర్మాణం చేశారు? దానిని నిర్వహించేది ఎవరు? దానిని నిర్మూలించగల అధికారం ఎవరికి ఉంది. ప్రస్తుతము యీ సామర్థ్యార్హతాధికారములు ఎవరివోగాని, మనవి కావు. కనుక, యీ జగత్తును సృష్టిచేసినవాడే దాన్ని మరమ్మతు చేసికొంటాడు. ఆ విషయంలో అనగా లోకాన్ని మరమ్మతు చేయడం విషయంలో మన సంకల్పం అనవసరం. ఏ సంకల్పంలేకుండా కూర్చుంటే మంచిదన్నారు మహాజ్ఞానులు. "మరమ్మతు చేసేవాణ్ని నేనే" అనే అహంభావం విడిచిపెట్టవలెనన్నారు. ఏ సంకల్పమూ లేకుండా కూర్చుండడం సుసాధ్యమైన పని కాదు. దానిని సాధకం చెయ్యవలెనన్నారు. అదే నిర్వృత్త్యావస్థ అన్నారు. అటువంటి నిర్వికల్ప సమాధిలో ఉండడమే జీవిత పరమావధి అన్నారు.

కాని, యీ కాలంలో అటువంటి మహాయోగులు పరమహంసలు ఏ పర్వతాలలో, ఏ అరణ్యాలలో ఉన్నారో ఎవ్వరికీ తెలియదు - మనకు కన్పించెడి సత్పురుషులు, మన సంఘసేవకులు-మనకు కన్పించెడి పెద్దలు, పురపాలకులు, రాష్ట్రపాలకులు, దేశపాలకులు వీరిలో నిజమైన వానప్రస్థులు కొందరైనా ఉంటే, దేశం కామధేనువులాగున ఉంటుంది. వారి తపస్సంపద దేశానికి లభిస్తుంది. మద్రాసు పురపాలక సంఘంలో నికరమైన పరార్థ ప్రాపకులు గాని వానప్రస్థులుగాని ఉంటే వానలెందుకు కురియవు? స్వజనాభిమానంచేత అనేక కష్టాలకోర్చుకోవచ్చు; అదేవిధంగా స్వరాష్ట్రాభిమానంచేత అనేక అవమానాలకు ఓర్చుకోవచ్చు. అందులోనూ, ఇందులోనూ తపస్సు అనేది ఉంది. ఆర్థికలాభైశ్వర్యములకోసం తపస్సు చేసినప్పటికీ పారమార్థిక చింతలో పడకతప్పదు. త్యాగంచెయ్యక తప్పదు. భాగ్యాలకోసం భగవంతుణ్ని ప్రార్థించి భజనజేయక తప్పదు. చిత్తం శివునిమీద కావచ్చు; భక్తి చెప్పులమీద కావచ్చు. కాని, అది కూడా వ్యర్థం కాదు.

"కాదు హరుపై ధ్యానంబు, -
విత్తంబుపై."

అని అంతటితో ఆ ధ్యానం విరమించకూడదు. విత్తంబుపై ధ్యానం ప్రారంభించినప్పటికీ తప్పలేదు. లక్ష్మీ ఉపాసన చేసినప్పటికీ తదేకదీక్షతో తపస్సు చేయవచ్చు. భగవంతుణ్ని ఏ రూపంలోనైనా చూడవచ్చు.

అట్టిపట్టుదల, ఆ ధ్యానముద్ర అనేది ఉంటే, కామి మోక్షకామి అవుతాడు. విటుడు యతి అవుతాడు. గృహస్థు వానప్రస్థుడవుతాడు. వానప్రస్థుడు - సన్న్యాసి అవుతాడు, సన్న్యాసి తపస్వి అవుతాడు. భోగి త్యాగి అవుతాడు - సంసారులు సంయమీంద్రులవుతారు.

"శీతజలస్నానంబును
భూతల శయనంబు-ఒంటి-పూటశనంబున్
నాతిగల బ్రహ్మచర్యము
నాతరమా, రాచవారి నౌకరిసేయున్?"

అని పూర్వోక్తప్రకారంబుగా పూర్వమొక ఉద్యోగస్థుడు ప్రయాణపు బత్తెాల అత్యాశను పోయి గత్యంతరం లేక గ్రామైక రాత్రంబుగా స్థావరంలేని జంగమదేవరలాగున సర్క్యూట్లు చేస్తూ తన ఉద్యోగ కార్యములను నిలుకడలేకుండా నిర్వర్తించి, ఒంటిపూట తిండితింటూ స్వగ్రామంలో ఇంటివద్ద సొంత భార్య ఉండినప్పటికీ, యిల్లు చెంత చేరక, యిల్లాలు వంతజూడక, నాతిగల బ్రహ్మచర్యం జరుపుతూ ఈ సంచారంతో సంసారం లేని విచారంతో నానా యాతనలు పడ్డాడు. అంతటితో విరక్తిపుట్టి, ఆ ఉద్యోగానికి స్వస్తి చెప్పి, స్వతంత్ర వ్యాపారం తన జీవనోపాధిగా కల్పించుకున్నాడు. అధికారుల క్రింద అవమానాలు ఎంత ఓర్చుకున్నాడోగాని, ఈ స్వతంత్ర వ్యాపారంలో అంతకన్నా ఎక్కువగానే తన ఖాతాదార్లతో ఓర్చుకుంటున్నాడు. "క్షమచేగాదవమాన మోర్పుట;" అనే విచారం ఉండనక్కరలేదు. "క్షమ" అనే మునీంద్రలక్షణం ఎందుకైనా మంచిదే. "క్షమ" అనేది కవచం వంటిది. అనేక విధాల అది రక్షిస్తుంది. క్రోధం అనేది శత్రువు. "క్షమ కవచంబు; క్రోధమది శత్రువు." "నాతిగల బ్రహ్మచర్యము నా తరమా?" అని కోతివలె గంతులు వేయడం అతడు చాలించాడు. ఇప్పుడు కాంత కంటె ముఖ్యం కరెన్సీనోటు అని గ్రహించాడు. "దానివలన నైహికాముష్మిక సుఖంబు లందు (పొందు) నరుడు" అని గ్రహిస్తున్నాడు.

★

# తిక్క చావు

అన్నగారి కూతురు వెంకటలక్ష్మి పెళ్లి పేరుచెప్పి, గౌరీనాథంగారు, ఆయన అల్లుడు రమణయ్య, ఆయన చుట్టాలు అంతా ఒకచోట కలుసుకోడం తటస్థించింది. రమణయ్య కోపిష్ఠి, తిక్కమనిషి అనీ, పెళ్లాన్ని చావగొట్టి, చీటికిమాటికి వదిలేస్తానని, బెదరిస్తాడనీ, చిన్న చిన్న విషయాలకు పేచీ పెంచుకుని ఉగ్రుడై పోతాడని అందరికీ తెలుసు. పెళ్లికి వచ్చిన జనమంతా రమణయ్యను చూసి బెదురుతూ దూరంగా ఉండసాగారు. అందుచేత రమణయ్య ఒంటరిగా కాలక్షేపం చెయ్యవలసివచ్చింది. తన ఎదురుగుండా పెళ్లివారంతా ఖులాసాగా ఉండడం, తాను ఒంటరిగా ఉండడం, రమణయ్యకు ఉడుకుమోతుతనం కలిగించింది. పలకరించినా, అతని దగ్గరికి ఎవ్వరూ రావడం మానేశారు.

పెళ్లివారంతా తననుంచి దూరంగా ఉండడానికి కారణం తనమామగారే అందరికీ తానుతిక్కమనిషని చెప్పి ఉంటాడని అనుమానం కలిగింది. నల్గురిలోనూ మామగారిని అభాసుచేసి, అందరి సానుభూతి తను పొందాలని రమణయ్య నిశ్చయించుకున్నాడు.

పెళ్లి హడావిడిలో కంగారుగా తిరుగుతున్న గౌరీనాథంగారి దగ్గరికి రమణయ్య వెళ్లి 'మామగారూ! మీతో చాలా జరూరు పనుంది' అన్నాడు కోపంగా. గౌరీనాథంగారు పెళ్లి హడావిడిలో అన్యమనస్కులై వినిపించుకోలేదు. మళ్లీ రమణయ్య రెట్టించి కోపంగా పిలిచేసరికి గౌరీనాథంగారు హడలుతూ 'ఏమిటోయి రమణయ్యా' అన్నారు. 'నా పెళ్లిలో మీకు నాలుగు వందలు రూపాయిలు దాచమనియిచ్చాను. అవి తక్షణం నాకు కావాలి' అన్నాడు రమణయ్య. 'ఆ డబ్బు బ్యాంకులో వుంది. కావాలంటే రెండురోజుల్లో యిస్తాలే' అన్నారు గౌరీనాథంగారు.

'మీరు ఎప్పుడూ యిల్లాగే అంటున్నారు డబ్బు బ్యాంకులో వేశాననక పోతే, వాడేసుకున్నానని చెప్పరాదూ' అన్నాడు రమణయ్య పేచీ పెంచుతూ.

గౌరీనాథంగారి మనస్సు చివుక్కుమంది. నిజంగా ఆయన డబ్బు బ్యాంకిలో వేశాడు. రమణయ్య ఏదో ఉద్యోగం చేస్తున్నాడుగదా, యీ డబ్బు కూడా యిస్తే ఖర్చుపెట్టేస్తాడని, ఆయన యివ్వ ఆలస్యంచేయడం మొదలు పెట్టారు. అల్లుడు తనమీద టబ్బుతినేసే నింద వేస్తాడని అనుకోలేదు.

'నీ డబ్బు తప్పకుండా రెండు రోజులలో యిస్తానోయి' అన్నారు గౌరీనాథంగారు నెమ్మదిగా.

రమణయ్య అరిచాడు. 'నా డబ్బు తక్షణం నాకిచ్చిచేయండి. లేకపోతే నాకీ సంసారం అక్కర్లేదు. మీ పిల్లని మీరు తీసుకుపొండి' అని రుసరుసలాడుతూ జందాలు పుటుక్కున తెంపేసి, గల్లంతు చేయసాగాడు. పెళ్ళివారంతా చుట్టూ మూగారు. కొందరు మొదట గౌరీనాథంగారు డబ్బు వాడేసుకున్నారేమో అని రమణయ్య మీద జాలిచూపారు. రమణయ్య పెళ్ళిపందిటిలో జందాలు తెంపేసి, పిల్లతో కాపురం చెయ్యనని బెదిరిస్తోంటే కొందరు పెద్దమనుష్యులకు కోపంవచ్చి 'ఏమిటోయి రమణయ్యా, ఆయన రెండు రోజులలో డబ్బిస్తానంటూంటే యీ గందరగోళము ఏమిటి?' అని నాల్గుచీవాట్లు వేశారు. రమణయ్యకు మరీ కోపం వచ్చింది; పెళ్లి జనమంతా తన మామగారి పక్షం మాట్లాడుతున్నారని.

ఇది పనిగాదని రమణయ్య ధుమధుమలాడుతూ ప్రక్కనున్న బంధువుల ఇంటికి వెళ్ళిపోయాడు. రాత్రి భోజనంకు రమ్మని ఎంతోమంది ఎన్నోవిధాల బ్రతిమాలారు. కాని రమణయ్య 'ససేమిరా' అని మొండి పట్టుపట్టి, పడుకున్నాడు. మొండిమనిషిని యింక సమాధానపరచడం కష్టమని, ఎవరూ రమణయ్యను భోజనం చెయ్యమని గట్టిగా పట్టుపట్టలేకపోయారు.

తెల్లవారగానే రమణయ్య మంచంమీద మూల్గుతూ ఉన్నాడు. ఎవరువచ్చి పలకరించినా మాట్లాడడం మానేశాడు. చూపు వంకర తిరిగింది. కాళ్ళుచేతులు నిటారుగా కర్రల్లా ఉన్నాయి. పళ్లు బిగిసిపోయి పెదిమలు ముడుచుకుపోయాయి. యీ స్థితిలో రమణయ్య కనిపించేసరికి, అతని బంధువులకు భయంవేసి, గౌరీనాథంగారి దగ్గరకు పరుగెత్తుకువెళ్ళి 'ఏమండోయి! మీ అల్లుడి పరిస్థితి ప్రమాదకరంగా ఉంది. చనిపోతున్న లక్షణాలు కనిపిస్తున్నాయి' అన్నారు. గౌరీనాథంగారు హడలిపోయారు. అల్లుడికి ఇంతలో ఏమి ముంచుకువచ్చిందని, కంగారుగా, పెళ్లియింట్లో పని మానేసి రమణయ్య దగ్గరకు పరుగెత్తారు. యీ సంగతివిని పెళ్ళివారంతా గౌరీనాథంగారి వెంబడి నడిచారు.

రమణయ్య మంచంమీద మూల్గుతూ ఉన్నాడు. పళ్లు పటపటలాడుతున్న శబ్దం వినిపిస్తోంది.

'ఏమిటోయి! రమణయ్యా!' అన్నారు గౌరీనాథంగారు.

రమణయ్య గట్టిగా మూల్గడం మొదలు పెట్టాడు.

'చ...చ్చి...పో...తు...న్నా...ను' అనినసుగుతూ బాధతో అన్నాడు రమణయ్య

'రాత్రి భోజనం మానేయడంవల్ల నీరసంగా ఉందేమో! కాస్త కాఫీ త్రాగు' అన్నారు గౌరీనాథంగారు.

రమణయ్య మాట్లాడలేదు. మరీ బాధగా మూల్గడం మొదలుపెట్టాడు. రమణయ్య పెదిమలు బిగిసిపోయి ఉండడంవల్ల గౌరీనాథంగారు కాఫీ కూడ అతని గొంతుకలో పోయలేకపోయారు. బంధువులు ఎవరు పలకరించినా రమణయ్య గట్టిగా మూల్గటం తప్ప సమాధానం యివ్వడం మానేశాడు. ఇది చూసి నిజంగా రమణయ్యకు ఆఖరి ఘడియలు దగ్గర పడ్డాయనుకుని కొందరు బంధువులు 'పాపం! రమణయ్య ఎంత మంచివాడు. చనిపోతున్నాడు!!' అని సానుభూతి చూపించారు.

రమణయ్య మూల్గు మరీ ఎక్కువైంది. ఇది చూసి, గౌరీనాథంగారు హడావిడిగా పోయి ఆ వూళ్ళో ఉన్న డాక్టరును పిలుచుకువచ్చారు.

శ్రీ పోతుకూచి సాంబశివరావు

డాక్టరుగారు రమణయ్యను ఆపాదమస్తకం పరీక్ష చేశారు. ఆయనకు చనిపోయేటంతటి రోగలక్షణా లేవీ రమణయ్యలో కనిపించలేదు. నాడి చూస్తే, కొద్ది నీరసం చూపించినా, పాతకలా కొట్టుకుంటూంది. రమణయ్య మూల్గు క్రమంగా ఎక్కువైపోతూంది.

డాక్టరుగారికి రమణయ్య రోగానికి ఏ మందుయివ్వాలో అర్థంకాలేదు. అయినా నీరసం తగ్గడానికి మందు కలిపి నోట్లో పొయ్యబోయారు. రమణయ్య పెదిమలు గట్టిగా బిగించబడి ఉన్నాయి. ఎంతశక్తి ఉపయోగించినా, రమణయ్య నోరు పెకలలేదు.

డాక్టరుగారు పిచ్చి వాళ్ళకుకూడా చికిత్స చేయడం తెలుసు. తన ఆసుపత్రిలో పిచ్చివాళ్లెవరైనా మందు త్రాగక అల్లరి చేస్తే, గట్టిగా తన్ని, మందు తాగించడం ఆయనకు అలవాటు. ఆ అలవాటైన పద్ధతిలో, డాక్టరుగారికి ఏమీ తోచక, రమణయ్య రోగం బాగా అర్థంకాక, బలవంతాన్ని అతన్ని కూర్చోపెట్టి, ఎడా పెడా, నాలుగువేళ్లూ అంటుకునేటట్టు చెంపలుగట్టిగా వాయించారు 'మందు త్రాగమని' అరుస్తూ.

అంతవరకూ చనిపోయే లక్షణాలు చూపిస్తున్న రమణయ్య 'బాబోయి! డాక్టరుగారూ! కొట్టకండి. బాబోయి! మందు త్రాగుతా!' అని మంచమీదనుంచి గబుక్కున లేచి ఒక్క గెంతు గెంతాడు. యీ విచిత్రం అంతా చూసి పెళ్ళివారు గొల్లుమని నవ్వసాగారు.

డాక్టరుగారికి రమణయ్యరోగం గబుక్కున అర్థం అయింది. ఇది ఒకవిధమైన తిక్కగాని మరేమీ గాదని రమణయ్య నడ్డిమీద యింకో రెండు గుద్దులుగుద్ది, బలవంతాన భోజనం తినిపించి, రమణయ్య నీరసం పోగొట్టాడు.

పదిమందిలోను రమణయ్య చూపిన విచిత్రప్రవర్తనచూసి గౌరీనాథంగారు 'ఇటువంటి అల్లుడు నా కర్మకొద్దీ దొరికాడని' బాధపడి చిన్నపుచ్చుకున్నారు. 'నీ అల్లుడికి ఏ రోగం లేదోయి. దొంగరోగం కాని' అన్నారు డాక్టరుగారు నవ్వుతూ గౌరీనాథంగారితో. రమణయ్యను చూసి, పెళ్ళివారంతా ఫక్కుమని అదే నవ్వడం మొదలుపెట్టారు. పెళ్లివారంతా మెల్లిగా వెళ్లిపోయాక 'యీగొడవంతా ఏమిటి రమణయ్యా,' అని నేనడుగుతే చచ్చినట్లు

(25-వ పేజీ చూడండి)



సరస్వతి శిలాప్రతిమ

—శ్రీ పి. నాగేశ్వర రావుగారు రచించిన రేఖా చిత్రం

సీరియల్ నవల

# రెండు మహా నగరాలు

చార్లెస్ డికెన్స్

మృత్యుశకటాలు కిరకిరారావంతో పారిస్ నడివీధుల గుండా సాగిపోతున్నయ్. ఆనాడు ఆరు శకటాలు, గిలటైన్ పిశాచి రక్తదాహం తీర్చటానికి నరబలులను మోసుకు పోతున్నయ్. మానవునకు ఊహాజ్ఞానం కలిగిననాటినుంచీ అనేక పిశాచ రూపాల్ని ఊహించాడు. ఆ మహా పిశాచాల రూపాల నన్నిటినీ సంకలనంచేసి గిలటైన్ అనే యీ భీభత్స పిశాచాన్ని సృష్టించాడు. ఫ్రాన్సు యెంతో సారవంతమైన గడ్డ; అయినా, అక్కడ ఒక గడ్డిపోచగాని, ఒక చిన్ని మొక్కగాని పొటమరించి పెంపొందటానికి తగిన వాతావరణమేమీ కనుపించలేదు గాని, ఈ గిలటైన్ మహామ్మారి పుట్టుకురావటానికి తగిన వాతావరణం పుష్కలంగా లభించింది అప్పుడేగాదు ఎప్పుడైనాసరే, మానవ జాతిని ఆ రకం సమ్మెటలుబెట్టి సాగగొడితే, తప్పనిసరిగా అలాంటి వికృతరూపాలు దాల్చితీరుతుంది. హింసాబీజాలు నాటుకుంటే అహింసాఫలాలు కాస్తాయా ?

పోనీ కాలం, యింద్రజాలంచేసి ఈ మృత్యుశకటాలను మళ్లీ వింతగామార్చివేసిందనుకోండి-మారినా ఏవిఁగా మారుతై-నిరంకుశులైన చక్రవర్తుల ఉక్కురధాలుగా మారతై; భూస్వామిక వర్గాల విలాసశకటాలుగా మారతై; కులటల క్రీడామందిరాలుగా మారతై; పవిత్రులైన మఠాధికారులకు మారుగా దొంగలకు తోడుపోతులకు ఆకరములైన దేవతారాధనా మందిరాలుగా మారతై, అన్నానికి ఆపన్నులై అటమటించే లక్షోపలక్షల పేదరైతుల పూరిగుడిసెలుగా మారతై.

ఆ మృత్యుశకటాలు అలా రోజూ వెడుతూనే వున్నయ్; రోజూ చూస్తున్న దృశ్యమేగనుక యెవ్వరూ వాటిని లక్షించటంలే. ఏ ఒక్క తలా, ఏ కిటికీలోనుంచీ తొంగిచూడటం లేదు.

ఆ బళ్ళల్లో వెడుతున్నవాళ్ళలో కొంతమంది మానవ జీవిత వైచిత్రిని తలపోసుకుని విభ్రాంతిపడుతూవున్నారు. కొంతమంది హతాశులై తలలు వంచుకు కూర్చున్నారు. కొంతమంది కళ్లు మూసుకుని కూర్చుని వ్యాకులమైపోతున్న మనస్సును కూడదీసుకోవటానికి ప్రయత్నించుతున్నారు. అందులో ఒకడు పిచ్చెత్తిపోయి పాటలు పాడుతూ బండిమీదే లేచి నిల్చుని నాట్యం చెయ్యటానికి ప్రయత్నించుతున్నాడు.

ఈ బళ్ళకుముందుగా ఒక చిన్ని అశ్వికదళం నడుస్తోంది. వాళ్ళను జనం ఆనాడు ఒకేప్రశ్న అడుగుతున్నారు. ఆ ప్రశ్నకు ఆ సిపాయిలు మూడవబండి చివర్లో కూర్చునున్న ఒక మనిషివంక చూపిస్తున్నారు. ఆ వ్యక్తి నాశనమైపోవాలని, అతని పేరెత్తి పెడబొబ్బలు పెడుతున్నారు. అతను ఈ వెర్రికేకల్ని పట్టించుకున్నట్టు లేదు; అథవా ఎప్పుడన్నా వినిపించుకున్నా, ఒక చిన్ని చిరునవ్వు నవ్వటం మినహా, అతనిలో పెద్ద మార్పేమీ కనపించటంలేదు. బండిలో అతనిప్రక్కనే, అతని చెయ్యి గట్టిగా పట్టుకుని ఒక అమ్మాయి కూర్చునుంది; ఆ అమ్మాయితో యేదో మాట్లాడుతూ ప్రశాంతంగా కూర్చునున్నాడు.

ఆ మృత్యుశకటాలకోసం యెదురుచూస్తూ, ఆ గూఢచారి సెయింట్ హొనొరె చర్చిమెట్లమీద నిల్చునున్నాడు; బళ్ళు అక్కడికి రాగానే ఆదుర్దాగా ముందుబండిలోకి తొంగిచూచాడు. 'అమ్మయ్యా! దీన్లో లేడు.' రెండో బండిలోకి తొంగిచూచాడు 'చచ్చాం! దీన్లోకూడా లేడు—నా ప్రాణాలమీదికి తెచ్చాడల్లే వుంది.' మూడోబండిలోకి తొంగిచూచినతరవాత అతని ప్రాణాలు ఒడ్డున బడ్డయ్; 'అమ్మయ్యా! బతికాం' అనుకున్నాడు. "ఎవ్రీమాండ్ ఇందులో ఎవరు" అని, అతని ప్రక్కనున్న మనిషి ప్రశ్నించాడు. 'అదుగో ఆ బండి చివర కూర్చున్న మనిషి' అని గూఢచారి సమాధానం చెప్పాడు.

'ఆ అమ్మాయి చెయ్యిబట్టుకునున్న మనిషేనా ?"

'మరే'—

'ఎవ్రీమాండ్ నశించాలి—బూర్జువాలు నశించాలి! ఎవ్రీమాండ్ నశించాలి!' అని ఆ వ్యక్తి గావుకేకలు పెట్టాడు.

'హుష్!—ఊరుకో ఎందుకొచ్చినగొడవ' గూఢచారి ఆ వ్యక్తిని నెమ్మదిగా బతిమిలాడాడు.

'ఏంభాయీ—ఏవిఁటీ'?

'ఏవీఁలేదు—అయిదారు నిమిషాల్లో ఎలానూ చావబోతున్నాడుగా—కాస్త ప్రశాంతంగా వుండనీ'

కాని యీ సమాధానం ఆ వ్యక్తికి నచ్చలేదు: 'ఎవ్రీమాండ్ నశించాలి'—అంటూ కేకమీద కేక పెడబొబ్బలెట్టేస్తున్నాడు. ఈ కేకలు చెవులబడి, మూడవబండిచివర కూర్చునున్న ఆ వ్యక్తి తల పైకెత్తి అతనివంక చూచాడు. అతని ప్రక్కనే గూఢచారి కనుపించాడు. ఎవ్రీమాండ్ అతనివంక చూస్తున్నట్టు గమనించగానే, గూఢచారి, నెమ్మదిగా ముఖంచాటేసి జనంలోకి తప్పుకున్నాడు.

సరీగా మూడుగంటలు కొట్టేసరికి మృత్యుశకటాలు గిలటైన్‌దగ్గిరికి వచ్చి ఆగినై. దానిముందు వేసివున్న కుర్చీలమీద ఉద్యానవనంలో కూర్చున్నట్టు కులాసాగా కూర్చుని, ఆడవాళ్లు లతలు కుట్టుకుంటున్నారు. ముందువరుసలో వున్న ఒక కుర్చీమీద యెక్కి నిల్చుని ప్రతీకారిణి, మేడమ్ డిఫార్జ్ రాకకోసం వెయ్యికళ్లతో వెదుకుతోంది.

'ఏయ్! మేడమ్ డిఫార్జ్ ఎక్కడేనా కనుపించిందా "—ఎవరికన్నా కనుపించిందా అని పెద్దపెట్టున కేక లేస్తోంది.

'రోజూ తప్పకుండా వచ్చేదే' అన్నది, ప్రక్కనున్న కుర్చీలో కూర్చుని లతలు కుడుతున్న మరోస్త్రీ.

అనువాదం: తెన్నేటి సూరి

'రోజూ మామూలేమిటి, ఈ వేళా వచ్చి తీరుతుంది—తప్పకుండా వచ్చి తీరుతుంది'—

'సరే!—మరికొంచెం బిగ్గరగా కేకపెట్టు ఎక్కడైనా జనంలో నిల్చునుందేమో?' అని మరో స్త్రీ సలహాయిచ్చింది.

ఎంత కేకలు పెట్టినా యేమీ లాభంలేకపోయింది—వాలంటీర్ యువతులను వీధి వీధికీ ఉరుకులు పెట్టించింది. ఎక్కడా పత్తా లేదు.

'ఛీ ఛీ!—ఎంత దురదృష్టం—అప్పుడే బళ్లు రానే వచ్చాయ్—ఎవ్రీమాండ్‌ను మరో క్షణంలో తలగొట్టేస్తారు. మాడమ్ చూడకుండానే—ఏమిటి చెయ్యాలి?

ఆ హతభాగ్యుల్ని బళ్ళల్లోనుంచి క్రిందికి దింపుతున్నారు. గిలటైన్ నిర్వాహకులు యెర్ర చొక్కాలు తొడుక్కొని సిద్ధమయ్యారు.

కసాల్ని ఒకతల తెగి క్రిందబడ్డది; లతలు కుట్టుకుంటూ కూర్చున్న భాగ్యశాలినులు తలలు పైకెత్తకుండానే 'ఒకటి' అని లెక్క వేశారు. రెండోతల తెగిపడ్డది, మూడోతల, నాలుగోతల వరసని తెగిపోతున్నయ్. చివరికి మూడోబండిలోనుంచి సిడ్నీ కార్టన్, అతని చెయ్యిపట్టుకునిఉన్న అమ్మాయీ బండి దిగారు.

భీభత్సంగా పైకిలేచి క్రిందికిపడుతూ మానవశీర్షాలను నరికి కుప్పలుబోస్తున్న గిలొటైన్ యంత్రం ఆ అబలకు కనుపించకుండా, ఎవ్రీమాండ్ ఆమెను తనవైపు తిప్పి నిల్చోబెట్టుకున్నాడు. ఆస్త్రీ దీనవదనంతో అతని ముఖంలోకి చూస్తూ అంత్యఘడియల్లో తనకు ఆసరా అయినందుకు అతనికి వందనాలర్పించుకుంటోంది.

'నీవు నాకు యింత ఆసరా యివ్వకపోతే నేను యింత ధైర్యంగా వుండగలిగేదాన్ని గాదు. నేనసలే కంగారు మనిషిని. ఈ అంత్యఘడియల్లో భగవంతుడు నిన్ను నాకు సహాయం పంపించాడు నిజంగా'—

'అలా కాదు చెల్లీ! నిన్నే నాకోసం పంపించాడు. చిట్టితల్లీ ఇలా నా ముఖంలోకి చూస్తూ అన్నీ మరిచిపో'

'నువ్వు నా చెయ్యిపట్టుకు నిల్చున్నంతసేపూ, నేను మరో విషయమేదీ ఆలోచించను—వాళ్లు నన్ను త్వరగా అంతం చేస్తే అంతే చాలు'—

'క్షణంలో తేల్చేస్తారు—ఆ భయం అక్కర్లేదు'

చుట్టూ జనంలో వుండి కూడా వాళ్లిద్దరూ ఒంటరిగా వున్నట్టు బిగ్గరిగానే మాట్లాడుకుంటున్నారు. వైవిధ్య వాతావరణాలలో పెరిగి చివరికి అంత్యఘడియలు వచ్చేసరికి యిరువురూ సన్నిహితులై చెట్టాపట్టాలు పట్టుకు మాతృహృదయంలో లయించబోతున్న విశ్వమాత కూర్మిసంతానం.

'నువ్వు మహాపురుషుడివి—పరమాప్తుడివి—కడసారి ఒక్క మాట అడగాలని వుంది—ఏమీ తెలియని అజ్ఞానురాలిని లోపల సందేహంగా వుండి అడుగుతున్నాను.'

'అడుగు తల్లీ!—సందేహమెందుకు'—

'నాకు ఒక పినతండ్రి కూతురుంది: నాకుమల్లేనే అదీ తల్లీ తండ్రీ లేని బిడ్డ; నాకంటే ఒక అయిదేళ్లు చిన్న. దక్షిణ ప్రాంతపు ఒక పల్లెటూళ్లో ఒక పేద రైతుయింట్లో వుంటోంది. దారిద్ర్యం మాకిద్దరికీ యెడబంధాలు చేసింది. నాకు యిలాంటి గతి పట్టిందని పాపం దానికి తెలీదు—నాకు ఉత్తరం వ్రాయటం చేతగాదుగా—చేతనైనా ఈ సంగతి దానికి యేమని వ్రాయను—దానికి తెలియకుండా వుంటమే మంచిదంటారా?'

'అవును—తెలియకపోవటమే మంచిది.'

'నేను అనుకుంటున్నదేమిటంటే—ఈ రిపబ్లిక్ ప్రభుత్వానికి యీ రక్తదాహం కొంచెం ఉపశమించి, ఈ బీదజనానికి యేదైనా కొంచెం మేలు చెయ్యగలిగితే, అది కూడా సుఖంగా వర్ధిల్లి చిరకాలం బ్రతుకుతుం దనుకుంటాను—బాగా ముసలిదైపోయేదాకా.'

'అయితే యేమిటి తల్లీ?'—

'నేను దాన్ని చూడాలంటే దేవలోకంలో ఎంతో కాలం వెంగబెట్టుకుని ఎదురుచూస్తూ కూర్చోవాలనుకుంటాను'

'అక్కర్లేదు పిచ్చితల్లీ— అక్కడ — కాలవ్యవధులు, కష్టాలూ యివన్నీ వుండవు'—

'అబ్బా ఎంత చల్లనిమాట చెప్పావు—అజ్ఞానురాలిని తెలియక యేడుస్తున్నాను—నిన్ను ఒక్కసారి ముద్దు పెట్టుకోనా—నా వంతు వచ్చేసిందా?'—

'ఆఁ!'—

'ఆ దీనురాలు అతని పెదవులు ముద్దుపెట్టుకుంది; అతను ఆ చిన్నదాని పెదవులు స్పృశించాడు. ఇద్దరూ పరస్పరం దీవించుకున్నారు. చిరునవ్వు నవ్వుతూ అతని చెయ్యి వదిలేసింది—గిలటైన్‌లో తల తెగిపోయింది—లతలు కుట్టుకుంటున్న అమ్మలక్కలు—'యిరవై రెండు' అని లెక్క వేశారు.

'నేను ఉత్థానకారకుణ్ణి—నన్ను నమ్మిన జీవి నశించదు' అన్న భగవద్వాక్యాన్ని స్మరించుకుంటూ కార్టన్ ముందుకు నడిచాడు.

[సంపూర్ణం]

ఒకసారి న్యూయార్కులో భారతీయ వర్తకు డొకడు రాత్రిసినీమా చూసి బస చేసిన హోటలకు తిరిగివస్తున్నాడు. దారిలో ఒక దొంగ అడ్డుపడి —"ఏయ్, మిష్టర్! నీ జేబులో వున్న డబ్బంతా యిస్తావా, లేకపోతే నీ మెడకు కోరికెయ్యమన్నావా?" అన్నాడు.

వర్త:—"కోరికితే కోరక వోయ్! యీ అమెరికాలో మెడజేనా లేకుండా వుండొచ్చుకాని, డబ్బు లేకుండా బ్రతకటం మాత్రం మహా చెడ్డకష్టం."

# రెండవ కూర్పు

"మట్టితో తయారైన శరీరం కాలిమట్టిలో కలిసిపోయింది. పంచభూతాలపాళ్లు పంచభూతాలతో కలిసిపోయేయి. విరిగిన పంజరంలోంచి చిలుకవలె ఆత్మ యెక్కడికో యెగిరిపోయింది. ఇదే యీ భవసాగరంలో మానవజీవన యాత్రారంభం, ప్రగతి, అంతం........." ఈజీచైరులో కూచుని వేణు వేదాంతపుమైకంలో మునిగిపోయేడు.

కాని అమరపుక్షణికం. ఎంతలో ముగిసిపోతుందోయాత్ర యెవ్వరికీ తెలీదు. అదే అగోచరపదార్థంయొక్క పరమరహస్యం!

ఎదురుగా టేబిలుమీద వున్న ఫోటోలో శ్యామల పెదవులమీద చిరునవ్వు తురగలిస్తుంది. 'ఎందుకొదిగులు! మనసు శరీరం దృఢంగావున్న యీమూడు పదులు నిండని మీకు నేను చెప్పాలా! నేను భౌతికంగా మీ యెదుట లేనుగాని, కొంచెం మీలో పరిశోధించుకోండి. మీ అంతరాళంలో ప్రతి అణువూ నా ప్రణయంతో పులకించడం లేదూ?......' వేణు శరీరం జలదరించింది.

* * *

'ధైర్యం వహించు వేణూ' అన్నాడు ప్రాణమిత్రుడు రాజారావు తనవొడిలో వొరిగిపోయి వెక్కి వెక్కి యేడుస్తూన్న వేణుతో.

'ఏం ధైర్యం వహించేది రాజా...ఇంత దగా యెక్కడైనా వుంటుందా...నిమిష నిమిషాన్నీ పన్నీరు పాయసంతోనింపి, మూడేళ్లపాటు నన్ను మరపించిన శ్యామలే లేకపోతే, యింకా ధైర్యం యేమిటి!...' అతడికి దుఃఖం కట్టలు తెగిన యేరులా పొర్లి పొర్లి వస్తూంది. 'నాకు దేవుడిచ్చినది గుండె గాని బండరాయికాదు......'

'అందుకే దాన్ని చిక్కబట్టాలి. దృఢం చెయ్యాలి. బండరాయి యేపాటి! సుత్తి పెట్టికొడితే పొడి అవుతుంది. వజ్రాఘాతాలవంటి కష్టాలు వచ్చినా నిభాయించుకుని తిరుగుతూన్న గుండెలు నీచుట్టుప్రక్కనే యెన్నో వున్నాయని తెలుసా?...'

వేణు లేచి కన్నీరు తుడుచుకొని 'నువ్వన్నదాంట్లో సత్యంవుందేమో' అన్నట్టు చూసేడు రాజారావు వేపు.

'రాజా! ఇప్పుడెక్కడనుండిరావడం?'

'పూనానుంచి. నాకు పూనా బదిలీ అయినట్టు నీకింకా తెలియజెయ్యనైనా లేదు, యీలోగా యీవార్త తెలియజేసింది మీవదినె......మీవదినెకు నెలలు నిండేయికదా...మా పూరంతా బాదస్తుల మయం ...... అయినాగాని వేణూ! జబ్బుగా వున్నట్టు తెలియజెయ్యరాదా. దుఃఖమైనా చూడ్డానికి ప్రాప్తి కలుగును. మీ వివాహానికి రాలేకపోయేను!"

'నాకుమాత్రం చెప్పిందా? ఎంత అదాట్టుగా దగాచేసింది' బరువుగాజవాబిచ్చేడు కన్నీళ్లు పెట్టుకుంటూ. కర్మచెయ్యడానికి లేస్తూ జాలిగా రాజారావు వేపుచూసి 'పన్నెండు అయిపోయేదాకా వుండిపో—నా గుండె కొంచెం కుదుటపడుతుంది' అన్నాడు.

వేణు వెడిపోయేకా రాజారావతని పడకగది పరిశీలించ జొచ్చేడు. అల్మారాలకున్న అల్లిక తెరలు, రంగురంగుల చైనా

శ్రీ అంగర వెంకటకృష్ణారావు,
శ్రీ ఆలమూరు
సూర్యనారాయణ

కూజాలలో సుందరమైన కాగితంపువ్వులు వస్తువుల అమరిక, గోడలకున్న పటాల సొంపుచూస్తూ, వేణు యీ మూడేళ్లయీ జీవితం వొకతీయనికలలా గడిపి వుండాలని గ్రహించేడు. వెంటనే పోల్చేడు యీ చిర వియోగం తను బోధించినంత సులువుగా భరించరానిదని.

'వేడినీళ్లు సిద్ధంగావున్నాయి, పోసుగోనాయినా' అంది వేణు మేనత్త. రాజా వెనక్కి తిరిగి క్రిందిపెదవి కొరుకుతూ అన్నాడు, 'అత్తయ్యా! నిజంగా వేణుకు తీరనికష్టంవచ్చింది......

'ఔను నాయనా... వాళ్లతండ్రి పోయినప్పటికెంతవాడు. ఆనాటినుండీ నా చేతులలోనే పెరిగాడు. తల్లిదగ్గరకు వెళ్లేవాడే కాదు. ఆమెపోతే వాడికి లోటేలేనట్టుంది. కాని యిది భరించరానిది. కుమిలిపోతున్నాడు.

'శ్యామల ఫోటో లేదా?'

'లేకేంనాయనా...యెన్నో వున్నాయి. మొన్ననే అన్నీ యే పెట్టిలోనో దాచేశాడు. వాటిని చూడను, యేడవను. పోనీ అవి బైటలేకుండడమే నయంఅనుకున్నా.'

'అత్తా మీరేం అనుకోకుండావుంటే నే నోటి అంటా...'

'చెప్పునాయనా అనుకోడానికేముంది.'

'వేణుని త్వరగా వొకయింటివాడిని చెయ్యడం శ్రేయస్కరం...'

'నువ్వుచెప్పింది నిజం...'

'మీరు చెప్పండి వాడితో...'

'నామాట వింటాడా...'

రాజారావు పెద్దగా నిట్టూర్చేడు.

* * *

రాజారావు అన్నమాటలు జ్ఞాపకానికి వచ్చి వెకిలిగా చిన్న నవ్వు నవ్వేడు వేణు. 'నన్నొకయింటివాడిని చేస్తాడట!' తిరిగి హేళనగా గళరవంచేసి పెదవులు విరిచేడు.

నీళ్లు పోసుగోవడానికి వెళ్లినప్పుడు సబ్బుడబ్బి తువ్వాలు పట్టుకుని యెవరో వెనకవచ్చినట్టు, భోజనం చేసి ఆఫీసు బట్టలు వేసుగుంటూంటే చిలిన తమలపాకు అందించడంలో గాజుల సవ్వడి వినిపించినట్టు, తలంటి పోసుగుంటూంటే తనశరీరంమీద గండు చేపలవంటి కనుచూపులు ప్రాకుతూన్నట్టు, అనుభూతి పొందుతూ, వెంటనే అది తన భ్రమ అని తెలిసి, జీవితం యెంత మాయ నాటకం? అనిపించేదతనికి. ఎంతమాయ నాటకమైనా సహపాత్ర లేకపోతే యెంత కష్టం! సంభాషణలు లేక జీవితం అంతా స్వగతాలమయమైపోతే, ఆ బరువు యత్తడం యే మానవుడి తరం! ఈ ఆలోచన తట్టగానే అతని గుండెలు అశ్రుభారంతో కృంగిపోయేయి!

అతడు తరుచు యీ ఆలోచనలలో మునిగిపోయి, బహిః ప్రపంచాన్ని మరిచిపోతూన్న విషయం మేనత్త గ్రహించింది. అలాంటి సమయాల్లో అతని నేదో ప్రస్తావనలోకి దింపి మనోవేదన వుపశమింప జేసేందుకి ప్రయత్నించేది.

'ఎన్నాళ్లిలా దిగులుపడతావు నాయనా? నీకేం లోటు? నువ్వు సమ్మతి

చూపితే పందలకు పందలు సంబంధాలొస్తాయి. ఒక యింటివాడివై వంశం నిలబెట్టడం నీవిధి.'

'అత్తా నాకా అదృష్టం యీ జీవితంలో లేదు. శ్యామల నన్ను తనతో స్వర్గధామంలోకి తీసుకువెళ్ళి, నన్నక్కడనుండి నరకకూపంలోకి తోసి, తనుమాత్రం అక్కడే వుండిపోయింది. ఈ జీవితయాత్రలో నాకు తిరిగి శ్యామలవంటి సహప్రయాణికురాలు లభించదు."

'వెఱ్ఱివాడా! లోకంలో మంచితనం, అందం నిండుకొన్నాయనుకున్నావా, రాజావద్దనుండి రేపో నేడో జాబురాదా! చూడు నాజ్యోతిషం. నీకు యీ వైశాఖమాసంలో వివాహం కాకపోతే నాపేరు సీతమ్మ కాదు. నాకూ శక్తి వుడిగిపోతూంది. సాయంలేకుండా ఎన్నాళ్లీదగలనీ సంసారం; అని ఆమె వంటింట్లోకి వెళ్ళింది.

వేణుకీ మాటలు చేదనిపించేయి. తన బాధ వీళ్ళెవరికీ తెలీదనుకున్నాడు. 'కాలిన ప్రేయసి దేహం, కాగుకంపు యీలోకం!' అన్న సూక్తిలో లోతు అనుభవించినవాడే గ్రహించగలడు.

* * *

ఉన్నపాళంగా బయలుదేరి రమ్మని రాజారావు వ్రాసిన వుత్తరంమీద నెల్లూరు వెళ్ళేడు వేణు. ఆ పిలుపుకు అర్థం వేణుకు తెలీదుగాని, సీతమ్మకు తెలుసు. ఆమె తన పెట్టెలో సిల్కు చొక్కాలు సేలం పంచలు సర్దుతూంటే, 'ఏమిటత్తా నీ చాదస్తం! ఎందుకివన్నీ పెళ్లికెడుతున్నట్టు' అన్నాడు. 'అలాగే నాయనా, నీ నోటిమాటగా వొక్కడివే వెళ్ళి, యిద్దరుగా తిరిగిరా' అని దీవించింది.

తన భార్యపోయిన ఏడాది తరవాత రాజాని చూడగానే వేణు విశాల నేత్రాలలో అరుణరేఖలు ప్రస్ఫుటించేయి. అంత అదార్తుగా తనను పిలిచినందుకు కారణం కూడా అడగలేకపోయేడు. గొంతులో వుండ బిగుసెక్కిపోయింది. కాని రాజా భార్య శాంత కాఫీ తెచ్చి అతనిముందు పెట్టగానే అతని హృదయంలోంచి దుఃఖం వుబికి కన్నీళ్లు జలజల రాలేయి.

'నాయనా, గడిచిపోయిన కాలం తిరిగి రాదు. నువ్వు చిన్నవాడివి. మగవాడివి. నీ హృదయం మహా సముద్రం.'

'నేను నిర్భాగ్యుడిని వదినా. నా గుండెలో మానని గాయం యేర్పడింది...'

విద్యావంతురాలైన ఆమె నేత్రాలలో వెలుగులు వెలిగేయి. జవాబు చెప్పలేదు. పసపసపండువంటి తన పిల్లడిని అతని వడిలో వదిలి లోపలికి వెళ్ళింది. ఆమె చేష్టలో అతని కొక దివ్యసందేశం గోచరించినట్టయింది.

రాజారావు, వేణు భోజనాలు చేస్తున్నారు. శాంత వడ్డిస్తూంది. ఆమె నిర్మల హృదయంలోంచి వచ్చిన నవ్వులు చిరుమువ్వల రవళిలా మ్రోగుతున్నాయి.

'మరిదిగారు మొహమాట పడకండి. కావలసినవి అడక్క అక్కరలేనివన్నీ వేయించుకోండి' ఈ హాస్యానికి అతనికి పకాలున నవ్వు వచ్చింది.

రాజా అందుకున్నాడు, 'కబుర్లు చెప్పకపోతే ఒక మంచిచెల్లెల్ని సంపాయించుకోరాదూ. ఆ కావలసినవి అక్కరలేనివి ఆవిడే చూసుకుంటుంది.'

'సంపాయించిపెడితే నాకేం బహుమానం యిస్తారు మరిదిగారు?' వేణు వెలవెలబోయేడు.

'మా తమ్ముడితరఫున నేను జవాబు చెప్తున్నా...!

'మీకేం వకాల్తుతీసుగొన్నారా?'

'ఔను...మరి వొదినెలు లంచాలడిగితే, అన్నలు వకాల్తు తీసుకోక

## శ్రీకృష్ణుని వంశం విశ్వవ్యాప్తం

క్లాప్రోతు అనే పాశ్చాత్య పండితుడు "*Asia Polyglotta*" (ఆసియా ఖండపు నానా భాషలు) అనే గ్రంథములో యిలా వ్రాసియున్నాడు. రష్యాయొక్క ఉత్తరభాగమైన సైబీరియాలోను యూరోపు ఖండఉత్తరభాగమైన ఫిన్లండు దేశములోను "సమ్మొమేదులు" అనే తెగవారున్నూ "చేదెలు" అనే తెగ వారున్నూ కలరు. "శ్యామ" అనునది శ్రీకృష్ణుని ఒక బిరుదనామము వంటిది. ఈ యదు వంశజులు "శామయదులు" అనబడేవారు. వీరే "సమాయదులు" లేదా "సమొయేదులు" అని వ్యవహరింపబడుతున్నారు. "చేదెలు" అనబడే తెగవారు "జేదులు" లేదా "యదులు" అని గ్రహించవలెను.

యదు వంశీకులు చిరకాలము మధ్య ఆసియా లో రాజ్యము చేసిరనియు మధ్య ఆసియాలో పైచెప్పిన తెగలవారుఉండినట్లును "రేమూసా" అనే పండితుడుకూడా వ్రాయుచున్నాడు. జేదు జాతివారు "యద్‌కీడం" అను ఒకానొక పర్వతశ్రేణిసీమ నాక్రమించియున్నట్లుమొగలాయివంశపు మొదటిరాజైన బేటరు చక్రవర్తి వ్రాసియున్నాడు.

క్రీస్తు పుట్టుటకు పూర్వము 1200 సంllలకు పూర్వమే యదువంశీకులు భారతదేశమును విడిచి పెట్టినప్పుడు "యద్-కీ-డం" అనే చోట వారు ఆగినట్లుగా రాజపుటానా లోని జైసాల్మరులో లభించిన యదువంశ చరిత్రలో ఉంది. "యదు-కీ-డం" అనగా "యదుదుర్గము" అని అర్థం.

# ★ రెండవ కూర్పు ★

యెలాగు? ఏణ్ణర్ధం గడువులో బారసాల [illegible]ముక్క తినిపిస్తాడు.'

'[illegible] కూటమీదే నిలవండి... ఏం నాయనా వేణూ, మీ అన్నయ్య చెప్పింది వినలేదా?' వేణు తలయెత్తి 'ఆఁ?' అని ప్రశ్నించేడు. 'నేను కొంచెం పరాకుగా వున్నా. మీరేం అంటున్నారో సరిగా వినడంలేదు...'

శాంత రాజావేపు కనుసైగజేసింది. రాజా అది అర్థం చేసుకున్నాడు.

'మరేంలేదు వేణూ. ఈ వూళ్లో నీకొక సంబంధం అగుపించింది. అప్సరసవంటి పిల్ల—పదహారేళ్ల ప్రాయం...'

వేణు చేతులోవున్న కడి విస్తరిలో జారవిడిచేడు. తన మోడుతేరిపోయిన హృదయవృక్షాన్ని తిరిగి చిగిర్పించే చల్లని వాన యీ జీవితంలో కురుస్తుందని అతనికి యేమాత్రం నమ్మకంలేదు. జీవితప్రయాణంలో అడుగుపెట్టగానే తన కాళ్లు విరిగిపోయేయి. పడినచోట పడివుండడమే గాని గత్యంతరంలేదు. మరగాళ్లు మరగాళ్లే! శ్యామల వొక అపూర్వమణి! తన చేతిలోంచి కాలగర్భంలోకి జారిపోయింది. తిరిగిరాదు...ఇలా పరుగెడుతున్నాయి అతని వూహాలు.

శాంత అన్నది 'నాకు తెలుసునాయనా నీ బాధ, నాకూ హృదయంవుంది. కాని నేను నూటిగా చెపుతున్నా. మా సలహా కాదనకు. ఈ అవకాశం జారవిడకు. నీ దుఃఖాన్ని, నీకు ఆపాదింపబడిన లోపాన్ని మరపించే సౌందర్యరాశి నువ్వు 'సై' అంటే నీ పాదాలమీద వాలబోతూన్నది. కాదనకు. ఎన్నినదులు వచ్చి తనలో ప్రవహించినా భరించే సముద్రం పురుషహృదయం... బేలపడకు...'

'వెంటనే రాజా అందుకున్నాడు, 'పోనీ నీకంత బందిలేదు. మధ్యాహ్నం వాళ్లింటికి వెడదాం. పిల్లని చూడు. తరవాత నీయిష్టం' అతని మౌనం అర్ధాంగీకారంగా గ్రహించేరా దంపతులు.

మధ్యాహ్నం మూడు గంటలకు రాజా, శాంత, వేణు చూపులకు వెళ్లేరు.

గదిలో చాపమీద రాజా, వేణు కూచున్నారు. శాంత, పెళ్లికూతురు తల్లి, పెళ్లికూతుర్ని తీసుకువచ్చి యెదురుగోడ దగ్గరగా వేసిన చాపమీద కూచోపెట్టేరు.

పదహారేళ్ళ పడుచు. సౌష్ఠవం కలిగిన శరీరం. బంగారుచాయ మేను. చెంపకు చేరవేసి కళ్లు. జరీకమ్మి అంచుకుట్టిన తెల్ల పట్టుచీర, ముదుర ఆకుపచ్చరంగు సిల్కు చోళీ ధరించింది. ఆమె నేత్రాలలో సిగ్గుకన్న భయం యెక్కువగా గోచరం వౌతూంది.

'అమృతం! వొక పాట పాడమ్మా' శాంత పురమాయించింది. అమృతం తన అమృతకంఠంతో పాడిన పాట యెంతో జాలిగా వుంది. వేణు గోడలకున్న చిత్రాలకేసి చూస్తున్నాడు.

చూపులు ముగిసి యింటికి వచ్చేరు. వేణు తన నిరుత్సాహం వ్యక్తపరచేడు. తను స్వయంగా చూసుకుని కాదంటే వాళ్ళేం జేస్తారు. సాయంత్రం తిరిగి శాంత వెళ్ళి వాళ్లతో వొక బొంకు బొంకింది, వెయ్యి రూపాయలు వేణు యివ్వలేనన్నాడని.

అమృతం తండ్రి 'ఆడపిల్లల వర్తకం' చేస్తాడు. అప్పటికి పెళ్ళిచేసిన ఆరుగురు కూతుర్లనీ వెయ్యేసి రూపాయలకమ్మేడు. వాళ్ళ జీవితాలు ధ్వంసం అయేయని వేరే చెప్పక్కరలేదు. ముసిలి భర్తలతో వాళ్ళ యౌవనం అడవిగాచిన వెన్నెలైంది. ఇది కడగొట్టు అమృతం వంతు. వేణు చిన్నవాడని, అందగాడని అమృతంతల్లి మురిసింది. కొనకళ్లంట రెండు దొంగచూపులు విసరి అమృతం వేణుని చూసి అతడిని తనకు భర్తగా ప్రసాదించమని భగవంతుని హృదయంలో ప్రార్థించింది. శాంత తెచ్చిన వార్త ఆ తల్లిపిల్లల హృదయాల్లో కార్చిచ్చు పెట్టింది!

వేణు తనను నిరాకరించినందుకు అమృతం మొదట కన్నీరు వరద వరద కార్చింది. కన్నతండ్రి డబ్బుకక్కుర్తిచేత రాక్షసుడికి మల్లే ముసిలివాళ్లకీ కుంటలకీ కూతుర్లని అమ్ముతూంటే, యీ సంఘం యెలా వొప్పుగుంటూందో అని ఆమెకు కోపంవచ్చింది. కడకు యీ సంఘనిర్మాతలైన పురుషజాతిమీదే ఆమెకు అసహ్యం కలిగింది. కాని యేం జేస్తుంది? తనకోసం కూడా యేమూలనో వొక డెబ్భై యేళ్లబోసి తాత సిద్ధంగా వుండివుంటాడు సంచులు పట్టుగుని. సంతలో పశువును కొన్నట్టు కొనుక్కుపోతాడు. ఈ ఆలోచనలతో రాత్రి అంతా వెక్కి వెక్కి యేడ్చింది. ఆమె కన్నీళ్ళతో హృదయంవలె పక్క కూడా తడిసిపోయింది.

ఆరాత్రి వేణుకూడా హృదయాందోళనతో వుచ్చేడు. తెలతెలవారుతోంటే వీధి అరుగుమీద కూచుని ముఖం కడుక్కున్నాడు. అక్కడికి కొంచెం దూరంలో వీధి కొళాయివుంది. అటు చూడగానే అగుపించిన దృశ్యాన్ని అతనికళ్లు నమ్మలేకపోయేయి. గుండెలు గట్టిగా కొట్టుకున్నాయి. అప్రయత్నంగా తన కాళ్లటువెంపు నడిచాయి. ఆ నిశ్శబ్ద నిర్మానుష్యవాతావరణంలో కొళాయినీళ్లు పట్టుగుంటూందొక పిల్ల. ఆమెను పరకాయించి చూడగానే వేణు తన జీవిత పుస్తకంలో పుటలు రెపరెప వెనక్కు తిరిగినట్టనుభూతి పొందేడు.

ఆమె అతడినిచూడగానే తల అటుకేసి తిప్పుకుంది. అతని శరీరం చమర్చింది. తడబడతూ, 'మీ దేవూరుపిల్లా' అన్నాడు. ఆమె నాగుపాములా కస్సుమంది. 'ఎంత మోసగాళ్లు మగాళ్లు! పువ్వులను మట్టుకుపోతూ పరిమళంకోసం ఆకాశంకేసి ముక్కు తిప్పుతారు' అని సగంనిండిన బిందె యెత్తుకుని చరచరసాగిపోయింది.

నిరాశతో, నిర్విణ్ణహృదయంతో అతడింటి ముఖం పట్టుతుండగా శాంత బిందెతో వస్తూ, అతడు కొళాయిచేరడం, అమృతం విడిపోవడం గమనించింది.



"నన్ను 'గాడిద' అన్నావటగా!"

"అవును అన్న మాట నిజమే."

"ఎందుకన్నావ్? మర్యాదగా క్షమాపణ వేడుకొంటావా, లేదా?"

"వేడుకొంటాను."

"ఎప్పుడు?"

"గాడిద కనుపించినప్పుడు!"

తరవాత యీవిషయం వేణు రాజాతో చెప్పి అటువంటి పిల్ల తనజీవితాన్ని తిరిగి ఆనందమయం చెయ్యగలదన్నాడు ప్రాధేయపూర్వకంగా. శాంత, రాజారావు ఆదేపనిగా పకపక నవ్వుకొన్నారు, చూపుల కోర్కెక అయ్యేం జాసుకున్నాడో అని.

'బాగుంది కాని తమ్ముడూ, నీకు నచ్చిన పిల్లని జతపరచే చాకచక్యం మీ వదినె కున్నదిగాని నాకు లేదు. నీ పిటీషను ఆమెకు పెట్టుగో...' వేణు శాంతవేపు జాలిగా చూసేడు.

'నేను ప్రయత్నిస్తాగాని, తెగ్గితే నాకేం బహుమతి యిస్తారు మరిదిగారు...'

రాజారావు భార్యవేపు చురచుర చూసేడు 'శాంతా, నీకు మాటమాటకీ బహుమతులేనా? మరీ లంచగొండివై పోతున్నావు.' శాంత పకపక నవ్వింది, లంచ మివ్వక పోతే... అని యేదో సామెత చెబుతారు లెండి.

'అయితే నీకెంత లంచం కావాలి?'

'ముందుగా వెయ్యిరూపాయిలు...'

రాజా వేణువెంపు తిరిగేడు 'ఆలోచించుకో తమ్ముడూ...మంచి తరుణం...'

వేణు వణుకుతూ 'చెక్కు పుస్తకం తీసుకురాలేదు...' అన్నాడు. 'పరవాలేదు, నువ్వు మాటిస్తే, నీ తరఫున నేను మాట యిస్తాను.

ఆరాత్రి ఆడపెళ్లివారింట్లో పెద్ద యుద్ధం జరిగింది. పనేమి ఆ సంబంధం తనకు వద్దని, నిర్బంధిస్తే నూతిలో వురుకుతానని అమృతం పట్టుబట్టింది. కాని ఆమె మాట యెవరు వింటారు. అడ్డుచెపితే వాత మారుస్తానన్నాడు తండ్రి.

ముహూర్తంమీద వివాహం జరిగింది. రాజా, శాంత, అమృతం తల్లి, అమృతం, వేణు తిరిగివచ్చేశారు. సీతమ్మ హృదయం ఆనందంతో పున్నమనాటి సముద్రంలా పొంగిపోయింది.

శాంత స్వయంగా గది శృంగారించింది. అమృతానికి యెంతో నచ్చజెప్పింది. 'చెల్లీ! నువు బహు అదృష్టవంతురాలివి. వేణు నవనీత హృదయుడు. అతడిని సుఖపెట్టి నువు సుఖపడు.' కాని యీ సుద్దులు అమృతానికి రుచించలేదు. గదిలోకి బలవంతాన వెళ్లి వొకమూల నక్కి నుంచుంది.

గదిలో వొక పదినిమిషాలపాటు నిశ్శబ్దం. వేణు అమృతం చెయ్యి మృదువుగా పట్టి 'ఈకోపు నీ కొంగున కట్టనిస్తావా?' అన్నాడు. ఆమె చెయ్యి విసిరిపారేసింది. ధారాపాతంగా కన్నీరు గార్చి యేడ్వజొచ్చింది. ఆమె దుఃఖాన్ని వేణు అర్థం చేసుగోలేకపోయేడు.

'అమృతం! నావల్లయేం అపరాధం జరిగిందో తెలీదు. జీవితంలో నే నొక పెద్ద దెబ్బతిని వున్నాను. నేనీ జీవితం ఒంటరిగా గడపవలసిందే అని, యీ భారం నిస్సహాయంగా మోయవలసిందే అని తలచాను. నే నే అమూల్యమణిని పోగొట్టుకొన్నానో అది తిరిగి సహజంగా లభించదు. కాని నాయెడ విధి కరుణామృతం వర్షించిందని మురిసేను. నా వల్ల జరిగిన అపరాధం యేమిటో చెపితే అది దిద్దుకోడానికి ప్రయత్నిస్తాను. ఒకటికి రెండు భగ్నహృదయాలు దురపిల్లడం నా అభిమతం కాదు. పువ్వులు మట్టుకు పోతూ, ఆకాశం కేసి ముక్కు తిప్పేనా? అదెప్పుడు."

అమృతం పైటతో కళ్ళు తుడుచుకుంది. 'చూపులకు వచ్చినప్పుడు నిరాకరింపబడిన నేను తిరిగి మీకెలా నచ్చేను?' ఈ ప్రశ్నకు వేణు ఆశ్చర్యపోయేడు.

'పిచ్చిదానా, ఆనాడు నిన్ను చూడడానికే వచ్చినట్టు యిప్పుడే తెలిసింది నాకు. నిన్నప్పుడు చూడనేలేదు. అప్పుడు నా హృదయం రక్తసిక్తమై వుంది. కాని నిన్ను చూడగానే నా గాయం మాయమైంది. ఇప్పుడు మరొకరహస్యం బైటపడుతూంది. చూడు...'అని తన పెట్టె తెరచి శ్యామల ఫొటో తీసి అమృతానికిచూపేడు. మొదట ఆమె దానిని క్రీగంటితో చూసింది. వెంటనే ఆమె ఆశ్చర్యంతో వుక్కిరిబిక్కిరైంది. ఫొటో తీసుకుని నిదానించి చూసింది.

'ఇది నాఫొటో! మీ కెలావచ్చింది' అప్రయత్నంగా ఆమె నోటంట యీ వాక్యం వెలువడింది.

వేణుకళ్లు సముద్రాలైపోయేయి. డగ్గుత్తికచేత మాట పెకలలేదు.

ఆ సన్నివేశం వర్ణించరానిది. ప్రక్కయింట్లో రేడియో వేణునాదామృతం వొలుకుతూంది. కౌగిలిలో కరిగి పోతూన్న నూత్నదంపతుల్ని చూడలేక సిగ్గుతో చందమామ మబ్బుమాటుకు పారిపోయేడు. ★

# పోయిన గడియారం

నాకు బాగా జ్ఞాపకం, రాత్రి నేను పడుకునేటప్పుడు చేతికి వాచ్ వుంచుకునే పడుకొన్నాను. కానీ పొద్దున్నే లేచిచూస్తే లేదు. పక్కమీది నుంచి ఒక్క గంతు వేసి, దుప్పటీ పరుపూ అన్నీ దులిపాను. మంచం కిందా, మీదా అంతా కలియ వెదికాను. గది నాలుగు మూలలా, నాలుగు కళ్ళతో గాలించాను. కనపడ లేదు. మరి ఇంతకీ ఏమయింది?

నేను పోయిన రెండు సంవత్సరాలనుంచి, ప్రెస్సు మీదిభాగంలో ఒక రూంలో ఏ భయం లేకుండా వుంటున్నాను. నాకు తెలిసినంతవరకూ, ముందప్పుడూ ప్రెస్సులో గానీ, నా రూంలో గానీ, యిటువంటిదేమీ జరగలేదు. నా రూంప్రక్కనే నలుగురు కాలేజీ స్టూడెంట్సు వుండేవాళ్లు. వాళ్లకొరకు వాళ్ల ఫ్రండ్స్ వస్తూ పోతూ వుండేవాళ్లు. అయినప్పటికీ ఎప్పుడూ నేను నా గది తాళం వెయ్యకుండా, తెరిచే వుంచేవాణ్ణి. కానీ ఇంతవరకూ నా గదిలోనుంచి ఒక చీపురుపుల్ల కూడా పోలేదంటే నమ్మండి!

అసలు ఆ వాచి మనది కూడా కాదు, పోతేపోయిందిగదా అని, విచారించి వూరుకోటానికి. పాత స్నేహితుడు గోపాలం, మొన్ననే కొత్తగా కొని చేతికి పెట్టుకొని తిరుగుతుంటే చూచి, నాకు కూడా రెండు రోజులు అట్లా పెట్టుకొని తిరగాలని బుద్ధి పుట్టింది. అడగ్గానే లేదనకుండా పాపం! నామీదవున్న ప్రేమ చేతనే అనుకోండి, లేక పాతస్నేహితం చేతనే అనుకోండి, లేక మాట తీసివేయ లేకనే అనుకోండి, మొత్తానికి, లేదనకుండా యిచ్చాడు.

వెంటనే బనియనుమీద గోపాలం వుంటున్న రూంకు పరిగెత్తాను. "ఒరేయి. నీ వాచి ఎవడో కొట్టేశాడురా!" "అరే! ఎట్లా! ఆశ్చర్యంతో అడిగాడు. జరిగిందంతా చెప్పాను, గోపాలం కొంచెం ఆలోచించి "ఒరేయి! రాత్రి నువ్వు పడుకునేటప్పుడు అసలు చేతికి గడియారంవుందా?" అని క్రాస్ చేయటం మొదలుపెట్టాడు. నేను "పడుకునేటప్పుడు వుంది" అని జవాబిచ్చాను. "ఒకవేళ మర్చిపోయావేమో, బాగా జ్ఞాపకం చేసుకో". "నాకు బాగా జ్ఞాపకం రాత్రి పడుకునేటప్పుడు గడియారం చేతికే వుంది!" అన్నాను. గోపాలం కొంచెంసేపు తీవ్రంగా నావైపు చూచి, దగ్గరగా కుర్చీ జరుపుకొని "నిజం చెప్పరా! నాకు అన్నీ తెలుసు. నీకన్న ఎక్కువ అనుభవం కలవాడినే. ఇంతకీ దాన్ని ఏ...ప్రియురాలికి దానం చేశావు. నాకు ఈ మాట వినగానే ఒళ్లు మండిపోయింది. నేను కోపంతో "ప్రియురాళ్ళు ఎవర్రా, పిండా కూడు వాళ్లు; అసలు అది..." నా మాట పూర్తి కాకమునుపే, భుజంమీద చేతితో తట్టుతూ "నాదగ్గర దాయకు. మనిషి అన్న తరువాత తప్పులు చేస్తూనే వుంటాడు. కొందరు పెద్ద తప్పులు చేస్తారు. కొందరు చిన్నవి. అంతే!" అని గోపాలం అంటున్న వేదాంతం వినేసరికి నా బుర్ర వేడెక్కిపోయింది.

గడియారం పోయిన సంగతి క్రింద ప్రెస్సులో పనిచేస్తున్న నాస్నేహితులందరికీ తెలిసిపోయింది. "ఎట్లా పోయింది ఎట్లా పోయింది" అని అడిగే వాళ్ళకు సమాధానం చెప్పలేక, నేను నా రూంకు వెళ్ళి ఏమి చేయటమా అని



"సర్పరాజు" ఫోటో:—శ్రీ హరిసత్యం.

ఆలోచిస్తూ కూర్చున్నాను. ఇంతలో క్రింది ప్రెస్సులోని పత్రికా సంపాదకులు గారు, నా రూంకువచ్చి, ముందు గడియారం పోయినందుకు విచారం చూపి ఎట్లాపోయిందని అడిగారు. నేను జరిగినదంతా తూచ తప్పకుండా వారికి చెప్పాను. రామాయణం విన్న తరువాత; 'రాముడికి సీత ఏమవుతుంది' అని ఎవరో మహానుభావుడు అడిగినట్లు, మా సంపాదకుడుగారు గడియారం ఎక్కడ పెట్టి పండుకున్నావు అని మళ్ళీ అడిగారు. "చేతికే" అని జవాబిచ్చాను. ఈమాట విన్నతిరువాత వారు లేచి గదిలో అటూ యిటూ తిరుగుతూ, ఏదో ఆలోచించి, గదిలోవున్న వస్తువులన్నీ కిందామీదా చేసి చూశాడు. పక్కకూడా దులిపాడు. ఆఖరికి నామీదవున్న చనువుకొద్దీ "నీవంటి ప్రపంచజ్ఞానం వున్నవాళ్లు అట్లా నిర్లక్ష్యంగా చేతికి గడియారం పెట్టుకొని పడుకోవటం ఏమీ బాగాలేదు" అన్నాడు. "అవునండి, చేతికి వాచ్ పెట్టుకొని బయట పడుకోవటం నిజంగాతప్పే," అని అన్నాను. "తప్పని చిన్నగా అంటారేమిటి. చాలా పెద్ద తప్పు. ఎటులేదన్నా వాచ్ 60, 70 రూపాయలకేం తక్కువవుండదు. అసలు రోజులు ముందులాగ లేవు. ఇప్పుడు ప్రతివానికి స్వార్థం ఎక్కువై పోయింది. ఇదంతా తెలిసికూడా మీరు.." అని ఆపేశారు. "అవునండి తెలిసికూడా గోతులో పడ్డాను" అని నీళ్ళు నములుతూ నేను అనగానే వారు వెంటనే మొదలు పెట్టారు, "నన్ను చూడండి, దగ్గరదగ్గర 40 ఏండ్లు వచ్చినయి. ఇంతవరకు ఒక చిన్న గుండుసూది కూడా నేను పోగొట్టుకోలేదు. నా వస్తువులన్నీ జాగ్రత్తగా వుంచుకోవటం బాగా తెలుసు. అట్లా జాగ్రత్తగా వుంచుకోవటం తెలియకపోతే, ఇంత పెద్ద చదువు చదివి ఏం లాభం? నేను రోజూ సాయంత్రం యింటికి వెళ్ళగానే, మా శ్రీమతి గార్కి, వస్తువులన్నీ భోషాణంలాగ వున్న ట్రంకులో పెట్టి తాళం వెయ్యమని ఆర్డరిస్తాను. ట్రంకులో పెట్టి తాళం వెయ్యడంవల్లనే, యింతవరకూ ఏ చిన్న వస్తూవూ పోలేదు. మీరుకూడా వాచ్ ట్రంకులో పెట్టి పండుకున్నట్లయితే, అది ఇవ్వాళ మీదగ్గిరే వుండేది. అని చిన్న లెక్చర్ యిచ్చి "సరేనోయ్. టైం అయింది వెళ్లొస్తాను" అంటూ వెళ్ళిపోయారు. నిజంగా సంపాదకులుగారు అన్నట్లు, ట్రంకులో పెట్టినట్లయితే వాచ్ వుండేదేమో! ఇంత చిన్న విషయంకూడా నా మట్టిబుర్రకు తట్టలేదు. నిజంగా అప్పుడు నామీద నాకే కోపం వచ్చింది.

ఇదే విషయం ఆలోచిస్తుండగా, టైపిస్టు




బుద్ధుని జీవకారుణ్యం

—శ్రీమతి జానకి (విజయవాడ)

# పోయిన గడియారం

సోమశేఖర్ వూడిపడ్డాడు. రాగానే, వాచ్ పోయినందుకు "పాపం!" అని సానుభూతి ప్రకటించాడు. "ఈ వెధవ కబురు వినగానే, చాలా విచారం కలిగింది బ్రదర్" అన్నాడు. నేను విషయం మరిపిద్దామని, 'సరేకానీ, ఎక్కడనుంచి రావటం" అన్నాను. "ఇంటినుంచే వస్తున్నా, ఇక్కడికి రాగానే ఇటువంటి వెధవకబురు వింటానని నాకేం తెలుసు. సరే కానీ వాచ్ ఎక్కడపెట్టి పడుకున్నావు రాత్రి?" అని ప్రశ్నించాడు. అసలు ఈ ప్రశ్నకు ఏం సమాధానం చెప్పాలో తోచక తికమకపడ్డాను. చేతికి పెట్టుకొని బయట పడుకున్నానంటే, మా సంపాదకునుగారు అన్నట్లు వీడుకూడా తెలివి తక్కువ దద్దమ్మ—అంటాడేమోనని" పెట్టెలో పెట్టితాళంవేసి బయటపడుకున్నాను" అన్నాను. నాఈ జవాబు వినగానే సోమశేఖర్ నవ్వుతూ "అట్లా చెప్పు నిజంగా నీది ఒట్టిమట్టి బుర్ర - అంటేనమ్ము వాచ్‌ని ఎవరయినా పెట్టెలో పెట్టి తాళం వేసి పడుకుంటారా? తెలివి తక్కువ దద్దమ్మ; ఖరీదుగల వస్తువులన్నీ, ఎప్పుడూ ఎవ్వరి వూహకూ అందని స్థలంలో పెట్టాలి. నీవు వాచ్‌ని ఏ పుస్తకాల బీరువాలోనో, ఏ పుస్తకం సందులో పెట్టినా బాగుండేది. దొంగకి అసలు పుస్తకాల బీరువాలో కానీ, పుస్తకాలలోగాని, ఏదైనా ఖరీదుగల వస్తువు భద్రపరిచి వుంటుందనే - అనుమానం తట్టదు". నిజంగా సోమశేఖర్ చెప్పింది కూడా బాగానే అగుపించింది. ఉద్యోగానికి టైం అవటంవల్ల శేఖర్ వెళ్లిపోయాడు.

పది అవుతుంది-నేను మొఖం అన్నా కడుక్కొనిబయటికిపోదామనిలేస్తుండగా, ప్రక్కగదిలోవుంటున్న స్టూడెంట్ ప్రసాద్ రానేవచ్చాడు. "ఏమండి, వాచ్ ఎట్లాపోయింది, ఎక్కడపెట్టిపడుకొన్నారు?" అందరూ అడిగినట్లు అతనూ అడిగాడు. నేను వెంటనే తడుముకోకుండా "పుస్తకాల బీరువాలో, పుస్తకాల సందులో పెట్టాను" అన్నాను. ఈమాట వినగానే ప్రసాద్ నవ్వటం మొదలు పెట్టాడు." ఏమండీ, అది బీరువాలో పెట్టేవస్తువా? అదికాక మీరు చాలా నవలల్లో చదివుంటారు, దొంగలు ముఖ్యంగా బీరువాలన్నీ గాలించి వదిలి పెడతారని. తెలిసికూడా పప్పులో కాలు వేశాడు. వాచ్‌ని భద్రంగా, ఎట్లాదాచి పెట్టాలంటే, మనం పడుకునేటప్పుడు, దిండుక్రిందపెట్టి పడుకుంటే; దొంగ సంగతేమిటి, దొంగ అబ్బకుకూడా, వాచ్ ఎక్కడుందీ తెలిసేదికాదు" అని స్టూడెంట్ కూడా నా తెలివికి నవ్వటం మొదలు పెట్టాడు. స్కూల్ టైం అవటంవల్ల— అతనుకూడా వెళ్లిపోయాడు.

లేచి మొఖం కడుక్కొని, కాఫీ తాగుదామని బజారుకు బయలుదేరాను. దారిలో స్నేహితుడు సబ్ ఇన్‌స్పెక్టర్ కేశవ్ కలిసి "ఏంరా! వాచ్ పోయిందట. ఎట్లా పోయింది?" అని అడిగాడు. నేను ఆశ్చర్యంతో "నీకు ఎట్లా తెలిసిందిరా!" అన్నాను. "గోపాలం చెప్పాడులే. ఇంతకీ అది ఎక్కడ పెట్టి పడుకున్నావు." "పడుకునేటప్పుడు, దిండు కింద పెట్టి పడుకున్నాను." ఈమాట వినిఇతను కూడా విరగబడినవ్వటం మొదలు పెట్టాడు. నవ్వు ఆపుకొని "నేను దొంగ తనాల్ని గురించి చాలా పుస్తకాలు చదివాను. దొంగల మనస్తత్వం నాకు బాగా తెలుసు. నీవు వాచ్‌ని దిండుక్రింద పెట్టి పడుకున్నావు. సగం తెలివైన పనే చేశావు. కానీ పూర్తిగా కాదు. అసలు పడుకున్నవాడు చచ్చినవానితో సమానమంటారు.

"ఒకవేళ నిద్రలోతల దిండుమీదినుంచి జరిగిపోయిందనుకో, అప్పుడేం చేస్తావు? దొంగ చూశాడంటే ఒదిలిపెట్టాడా, ఒదిలి పెట్టడు. అందుకని ఇంతకీ నేను నీకు చెప్పేది ఏమిటంటే, వాచ్‌ని చేతికి పెట్టుకొని నిశ్చింతగా నిద్రపో. దొంగ వెధవలకి మన చేతిగడియారం తీయటానికి గుండె లెక్కడివి? ఇకముందు ఇటువంటి తెలివి తక్కువ పనులు చెయ్యకు. వెళ్ళొస్తాను. గుడ్ బై" అంటూ వెళ్లిపోయాడు. ఆఖరికి కథ, 'ఉయ్యాల వూగి వూగి ఒకే చోటుకు చేరుతుందన్నట్లు' నా కథ కూడా తిరిగి మళ్లీ మొదటికే చేరుకుంది. కేశవ్ సలహా వినగానే ఉదయంనుంచి వాచ్ పోయిందని విచారంతో వుంటున్న నాకు, ఒక్కసారి ఎక్కడలేని నవ్వు వచ్చిందంటే నమ్మండి. కాఫీ హోటల్‌లో దూరి, ఇదే విషయం ఆలోచిస్తూ, వేడి వేడి కాఫీ తాగ్గానే నాలుక చురుక్కుమంది... ★

వెనుక ఒకసారి మురికి వానలు కురిసినప్పుడు గ్రాండ్ ట్రంక్ రోడ్డువంటి పెద్దరోడ్డు మీద అనేక తావుల్లో గండ్లు ఏర్పడ్డాయి. ఆ గండ్లను పూడ్చేందుకు ప్రభుత్వం హైవేస్ శాఖ వుద్యోగులను సరగున పంపించింది.

అలా వెళ్ళిన ఒక జట్టు 15 అడుగుల లోతు 18 అడుగుల వెడల్పు గల ఒక గండిని పూడ్చవలసివచ్చింది. వాళ్లు ఎంత ప్రయత్నంచేసినా అది సాధ్యపడ లేదు. ఆ జట్టు తాలూకు పెద్ద, ప్రభుత్వానికి యీ విషయాన్ని ఎరుక పరుస్తూ, తనవద్దవున్న మనుష్యులతో ఆ పని అయ్యేటట్లు లేదు కనుక అదనంగా మనుష్యలను పెట్టుకోవటానికి మంజూరు యిప్పించిమని వేడుతూ ఒకజాబు వ్రాశాడు.

వారం రోజుల తరువాత ప్రభుత్వం ఆ జాబుకి సమాధానం యిస్తూ, ప్రస్తుత ఆర్థిక పరిస్థితులలో అదనపు వ్యయం తాము భరించలేరు కనుక, వున్న మనుష్యులను తీసివేసి వారిస్థానే 15 అడుగుల పొడ వున్న మనుష్యులను వేసుకొని వారిద్వారానే ఆపని చేయించవలసిందిగా సూచించారు.

# మితవ్యయం

'ఈ యెఱ్ఱరిబ్బను గాలిపడగ తోకకి కడతాను. ఎంత ఎత్తైనా యెగరెయ్యొచ్చు యెంచక్కా. అమ్మయ్యో బాబోయ్. ఎంత రిబ్బను వుందో' అన్నాడు ఎనిమిదేళ్ళ శ్రీనివాసు.

'నాన్నెంత మంచివాడో. రోజూ మనం అరగజం అరగజం రిబ్బనుముక్కలు కొనుక్కోవడం చూసి యేకంగా ఓమూటే తెచ్చినట్లున్నాడు' అంది పెద్దపిల్ల సీత.

'నాకో పెద్దముక్క కోసివ్వవూటే అక్కా' అంది నాలుగేళ్ళ రమ.

'అంతా జడలోనే పెట్టుకోకూడదు. అంచులేని కండువాలకి పైట కొంగునా, జాకట్లకి చేతులదగ్గిరా కుట్టుకుంటే యీ రిబ్బను యెంతో బాగుంటుంది' అంది అక్కగారు.

'ఎన్ని తెచ్చినా మీకే చాలవు. రోజూ పరికిణీలకనీ, లాగులకనీ బొందుల కోసం చంపేస్తూంటారు. వేళకి యేదీ కనబడదు. నానా బాధగానూ వుంటోంది. ఈ రిబ్బను దళసరిగా బాగుంది బొందులకి. అంతా పాడుచెయ్యకండి' అంది తల్లి కమలాభాయి.

రమణారావు పి డబ్ల్యు డి ఆఫీసులో డ్రాఫ్ట్స్‌మన్. జీతం 200 తెస్తున్నాడు. నలభై యేళ్లుంటాయి. మనిషి మంచివాడు. భార్య కమలాభాయి భర్త అడుగు జాడలలో మసులుకొనేది. వారికి అయిదుగురు సంతానం. ముగ్గురు మగపిల్లలు, ఇద్దరు ఆడపిల్లలు. పెద్దపిల్లలు ముగ్గురూ స్కూల్లో చదువుతున్నారు. వచ్చీ పోయే కొంప. రాబడి రెండు వందలు వస్తే ఖర్చు మూడు వందలు దాటుతోంది. భూములమీద వచ్చే కొద్దిపాటి ఆదాయం సహాయంతో కాలక్షేపం చేస్తున్నారు.

'జీతం వేరు, కరువుబత్తెం వేరు అనకుండా జీతంతో కరువుబత్తెం కలిపివెయ్యా'మని కొంతకాలంగా గవర్నమెంటు వుద్యోగులు ఆందోళన చేస్తున్నారు. ఆ విధంగా ప్రభుత్వం చేస్తుందని ఆశించారు. కాని, యెన్నాళ్ళకీ నెరవేరేటట్టు కనబడక పోవడంవల్ల అందరికీ నిస్పృహగా వుంది. 'ఎన్నాళ్లు నౌఖరీ చేసినా యింతే. మన కష్టసుఖాలు వాళ్ళకక్కర్లేదు. ఇదివరకు విదేశీయులు పాలకులు గనుక ఏమీ చెయ్యలేదనుకున్నాం. ఇప్పుడు మనవాళ్లు చేసిన నిర్వాహకమేమిటి?' అని అనుకున్నారంతా.

"అచ్ఛా, అచ్ఛా. ఎంత రిబ్బనో నాకు" అంటూ అరుస్తూ గంతులేస్తోంది చిన్నపిల్ల రమ.

అప్పుడే ఆఫీసునుండివచ్చిన రమణారావు పెరట్లో కాళ్లు కడుక్కుని లోపలికి వస్తూ 'అమ్మాయీ దా' అని పిలిచాడు రమని. ఆ అమ్మాయికి రిబ్బనుసరదాలో తండ్రిపిలుపే వినబడలేదు 'ఎంతరిబ్బనో నాకు' అంటూ గెంతుతోంది యెప్పట్లా.

'రిబ్బనేమిటమ్మా? యెందుకలా గెంతుతున్నావ్' అన్నాడు రమణారావు పిల్ల చెయ్యిపట్టుకుని నవ్వుతూ.

అడిగిందే తడవుగా 'నాన్నోయ్ మరేం మనబల్లమీదేం యింత రిబ్బనుండ వుంది'

**శ్రీమతి వేదుల మీనాక్షిదేవి**

అంటూ కళ్లు పెద్దవిచేసి రెండుచేతులతో ఫుట్‌బాలంత సైజు చూపిస్తూ.

'ఏదీ' అన్నాడు తండ్రి.

'చూపిస్తాను పదండి' అంటూ పెసరకాయల్లాంటి తనచేతి వేళ్ళతో వాళ్ళనాన్న చెయ్యిపట్టుకుని లాక్కుని పోయింది సావిట్లో బల్లదగ్గిరకి.

బల్లచుట్టూవున్న పిల్లల్ని, భార్యని చూసి 'ఇదేం? అంతా యిక్కడ చేరారొక్కమాటే' అన్నాడు రమణారావు.

'ఏంలేదు. ఈ రిబ్బను వుండని చూసి అందరం దాన్ని యెల్లావుపయోగించుకోమా అని చూస్తున్నాం' అంది కమలాభాయి.

'ఎవరికీ పనికిరాని ముక్కలుగా కత్తిరించి పారెయ్యకుండా ముందుగా చెప్పారు నయమే. మీరెవరికోసం కొనలేదిది. ఇంటి ఖర్చు నానాటికీ యెక్కువై పోతోంది. హెచ్చడమే కాని తగ్గే లక్షణాలుకూడా కనబడ్డంలేదు. అందుచేత ఒక్కొక్క ఖర్చుకొక ఫైలు చొప్పున పెట్టి కుటుంబపు ఖర్చులు కొంత అదుపులోకి తేవాలనుకుంటున్నాను. నేను తయారుచేయబోయే ఫైళ్ళు కట్టుకుందుకు యీ రెడ్ టేప్ తెచ్చుకున్నాను- బాగుంటుందని" అన్నాడు రమణారావు.

'అదా సంగతి! అలాంటి వుద్దేశమే మీకుంటే ఆపనిలో ప్రధానమంత్రి పదవి నేను నిర్వహిస్తాను" అంటూ చక్కాబోయింది లోపలికి కమలాభాయి.

'నేను విదేశాంగశాఖ నిర్వహిస్తాను నాన్నా' అన్నాడు పెద్దపిల్లాడు హనుమంతరావు.

'తప్పకుండా అలాచెయ్యి నాయనా, ఏనాడూ యిల్లు పట్టకుండా తిరుగుతూంటావు గనక విదేశాంగశాఖ నిర్వహించడానికి నువ్వే తగుదువు' అన్నాడు హేళనగా తండ్రి.

* * *

సాయంత్రం ఆరు గంటలైంది. రమణారావు షికారు వెళ్ళాడు. పిల్లల భోజనాలయాయి. వాళ్ళందరినీ దగ్గిర కూర్చోపెట్టుకుని 'మీకో విషయం చెప్పాలనుకుంటున్నాను. మీ నాన్నగారొక్కరు మనందరి పోషణకోసం కష్టపడుతున్నారు. ఆ రోజు కారోజు ఖర్చు పెరిగిపోతోంది యింట్లో. అందుచేత మనమంతా కలిసి మీ నాన్నగారికి బాధ లేకుండా సంసారపు



# మితవ్యయం



ఖర్చులు తగ్గించాలి సాధ్యమైనంతమట్టుకు. ఔనా? కాదా? చెప్పండి' అంది తల్లి.

'ఔను. తప్పకుండా అలా చెయ్యాలి' అన్నారంతా యేకగ్రీవంగా.

'మహామహా వాళ్లలాగ కబుర్లతో సరి పెట్టకూడదు 'అల్లాగే చేద్దాం' అని. 'పని చేసి చూపించాలి' అంది తల్లి.

'నువ్వేం చెయ్యమంటే అది చెయ్యడానికి మేం సిద్ధంగా వున్నాం' అన్నాడు హనుమంతరావు తమ్ముళ్ల తరఫునా, చెల్లెళ్ల తరఫునా కూడా నాయకత్వం వహించి.

'మనమంతా ఒక కమిటీక్రింద యేర్పడి ఖర్చులు యేవిధంగా తగ్గించాలో ఆలోచించాలి.' అంది తల్లి.

కొంతసేపు అంతా ఆలోచనా నిమగ్నులయారు. ఆఖరిపిల్లాడు, పిల్ల మాత్రం యిదేదో అయోమయంగా వుంది కాబోలు కబుర్లు చెప్పుకుంటున్నారు కొత్త అవతలకి జరిగి.

'మనం తగ్గించవలసిన ఖర్చులలో మొదటిది. వారం వారం మనకు వెన్న కాచిన నెయ్యి తెచ్చేమనిషిని మానిపించేద్దాం. బజారు నేతికీ దీనికీ రూపాయి తేడావుంది వీశకి. ఆ లెక్కని మనం పోయించుకునే నేతికి మూడుపావలాలు యెక్కువ అవుతోంది వారానికి" అన్నాడు పెద్దవాడు.

'నిజమే' అన్నారంతా.

'ఇక రెండవది. పాలు కాఫీకి మాత్రమే కాకుండా పెరుగుకోసంకూడా కొంటున్నాం. పెరుగుకోసం కొనే పాలు మానేసి గొల్ల పెరుగు పుచ్చుకుందాం. రోజుకి అర్థ రూపాయి ఖర్చు తగ్గుతుంది' అంది తల్లి.

అంతా సమ్మతించారు.

'రెండుపూటలా కూరలు వండుకుంటున్నాం. ఇకముందు ఒక్క పూటే కూర. రెండోపూట పచ్చడిచేసుకుందాం. ప్రొద్దున్న పప్పు, పులుసు గాని, పప్పు, కూర, చారుగాని చాలు. పప్పు, పులుసు కాచిననాడు కూర, పచ్చడి రాత్రి చేసుకోవచ్చు. ఈ పద్ధతి మీకు నచ్చిందా?' అంది తల్లి.

'ఓ. నచ్చింది' అన్నారంతా.

'తరుచు ఫలహారాలు చెయ్యవద్దు. మాకూ, నాన్నకీ ఆదివారం శెలవు కనుక ఆనాడే ఫలహారం చెయ్యాలి. మిగిలిన రోజులలో అక్కర్లేదు' అంది పెద్దపిల్ల.

'ఆ ఫలహారమైనా రాత్రిభోజనాల వేళ చేస్తే ఇక ఆపూట భోజనం అవసరం వుండదు. ఆవిధంగా కొంత లాభం కూడాను.' అని ఒక సవరణ ప్రతిపాదించాడు చిన్నవాడు మధుసూదనుడు.

'అల్లావద్దు. మజ్జాన్నమే చెయ్యాలి' అంది రమ ఆటల్లోనూ, మాటల్లోనూవున్నా భోజనం, ఫలహారం మాటలు చెవిని పడగానే వాళ్లదగ్గిరకి వచ్చి.

'నేనన్నమాట కాదంటావా?' అని చెల్లెల్ని గద్దించాడు. తనవాదనని ఖండించిందనే కోపంతో.

ఇంతలో తల్లి కలుగజేసుకుని "మధూ, మనం అంతా యిక్కడ చేరింది పూర్ టాక్స్ పేయర్‌కి ఖర్చు తగ్గించడానికి. మనం మితం వ్యయం కమిటీ మెంబర్లం అన్నమాట. మనం ఒకరితో ఒకరం తగూలాడుకోకూడదు. దుర్భాష లాడకూడదు. ఒకరు చెప్పిన విషయాన్ని గురించి అనేకులనేక రకాలుగా విమర్శిస్తారు. ఆ విమర్శించేవారిలో మంచిదనేవారూ వుంటారు, చెడ్డదనేవారూ వుంటారు. మంచిదన్నారని ఆనందం గాని, చెడ్డదన్నారని కోపం గాని అవసరం లేదు. మనం చెప్పదలచుకున్న విషయాన్ని సంకోచం లేకుండా చెప్పాలి. ప్రతీవారికీ వారివారి స్వంత అభిప్రాయాలు స్వేచ్ఛగా తెలియజేసేందుకు మన రాజ్యాంగరీత్యా హక్కు వుంది. నువ్వన్న మాట కాదందని చెల్లాయిని కసరకూడదు. పోనీ, మీ అందరి అభిప్రాయం తెలుసుకుంటాను. నేను ఒకటి అడుగుతాను. నచ్చినవాళ్లు చేతులెత్తండి: 'మధ్యాహ్నం ఫలహారం అక్కర్లేని వాళ్లెవరు?' అంది.

పెద్దవాడు, రెండోవాడు, పెద్దపిల్ల చేతులెత్తారు. అరటిచెట్ల ఆటలోలాగ వాళ్లు చేతులెత్తడం చూసి కుర్రాడు శ్రీనివాసు మెల్లిగా తనూ చేతులెత్తాడు.

చిన్నపిల్ల రమ ఒక్కత్తే యెత్తలేదు చెయ్యి.

'అంటే రాత్రి ఫలహారం కావాలనే వాళ్లు నలుగురన్నమాట. వద్దనే వాళ్లు ఒకే ఒకరు (ఆ ఒక్కరూ రమ.) కాబట్టి ప్రతి ఆదివారం రాత్రి భోజనాలవేళ ఫలహారం యివ్వడానికి యేర్పాటు చేశాము' అంది తల్లి.

'నాకు ఒక్కదానికీ మజ్జాన్నం చేస్తే సరి' అంది రమ.

'పొడుకాఫీ మానేద్దాం. పొడుం పౌను 3½ రూపాయ లైపోయింది కూడాను' అన్నాడు రెండోవాడు.

'అలా చేద్దాం' అన్నారు పిల్లలంతా.

'మనం మానేద్దాం. కాని మీ నాన్నగారికి ఓపూట యివ్వక తప్పదు. రెండోమాటు యెల్లాగా యింట్లో తాగరు ఆఫీసులోనే గాని. రమ పొద్దున్న పాలు కాసిని తాగాలి. అందుచేత ఓ సోలెడు పాలు కొంటే సరిపోతుంది' అంది తల్లి.

పిల్లలు సమ్మతించారు.

'అమ్మా, సబ్బుబిళ్ల కొంటే పది రోజులైనా రావడంలేదు. అందుచేత సబ్బు మానేసి సున్నిపిండితోనో, కుంకుడుకాయలతోనో రుద్దుకుందాం' అంది పెద్దపిల్ల.

'సరే' అన్నారు కమిటీవారు.

మితవ్యయం కమిటీవారీ క్రిందివిధంగా ఖర్చు తగ్గించడాని కేర్పాటు చేశారు.

1. నెయ్యివల్ల వారానికి మూడు పావలాల చొప్పున నెలకి 3 రూపాయలు. సంవత్సరానికి 36 రూపాయలు.

2. పాలవల్ల రోజుకి ½ రూపాయి చొప్పున నెలకి 15 రూపాయలు. సంవత్సరానికి 180 రూపాయలు.

3. కాఫీ మానడంవల్ల వారానికి 2 రూపాయల చొప్పున నెలకి 8 రూపాయలు. సంవత్సరానికి 96 రూపాయలు.

4. కూరలవల్ల వారానికి 2½ రూపాయల చొప్పున నెలకి 10 రూపాయలు. సంవత్సరానికి 120 రూపాయలు.

5. సబ్బులు మానడంవల్ల నెలకి 1½

రూపాయిల చొప్పున సంవత్సరానికి 18 రూపాయలు.

మొత్తం సంవత్సరానికి తగ్గింపబడిన ఖర్చు—450.

*　　　*　　　*

'నెయ్యి వాసనగా వుంది' అన్నాడు హనుమంతరావు.

'నాకు వెయ్యకు' అని పుట్టిఅన్నమే తిన్నాడు మధు. మిగిలినవాళ్లు ఒక్కొక్క బొట్టు వేయించుకున్నారు. చిన్నపిల్ల రమమాత్రం యథాప్రకారంగా పేచీపెట్టి చాలా నెయ్యివేయించుకుని పిసికి పారేసింది మింగుడుపడక.

'మజ్జిగ నాలుక చిల్లుపడేట్టుంది' అంది పెద్దపిల్ల.

'వాసనకూడాను' అన్నాడు రెండోవాడు. గ్లాసులో మజ్జిగపోయించుకుని కొస్తవుప్పకలుపుకొని త్రాగేశాడు. అంతా అతన్ని అనుకరించారు.

రాత్రి పచ్చడీ మెతుకులేకాకుండా వాసన నెయ్యి, గొల్లమజ్జిగతో పాపం పిల్లలు తినలేకపోయారు. ఎలాగో ముగించుకుని యివతలపడ్డారు. పనులన్నీ చేసుకొని తల్లివచ్చి కూర్చుంది. పెద్దపిల్లలు ముగ్గురూ దగ్గరచేరారు. ఆ కబురూ యీ కబురూ చెప్పినట్టే చెప్పి 'అమ్మా, మనం వేసుకున్నపద్ధతి అంత బాగా లేదు. మరో పద్ధతిగా చేసుకుందాం' అన్నారు.

'ఏమిటాపద్ధతి' అంది తల్లి.

'వెనకటి వేలి మనిషి దగ్గరే నెయ్యి పుచ్చుకుందాం. యెటొచ్చీ వెనక కొన్నంత కొనకుండా అందులో సగంమాత్రమే పుచ్చుకుందాం' అన్నాడు పెద్దవాడు.

'పాలు ఒక్క సేరుపుచ్చుకొని మజ్జిగ చేసుకుని పోసుకుందాం. గొల్లమజ్జిగ పోసుకోలేం బాబూ' అంది పెద్దపిల్ల.

ఇంతలో రెండోవాడు అందుకుని 'అమ్మా రెండుపూట్లూ కూరవుంటేకాని తినలేను. ఇదివరకంతంత కాకుండా కొంచెం కొంచెం వండు' అన్నాడు.

'కాఫీ లేక తలనొప్పివచ్చింది. ఒక్కపూట తాగుదాం' అంది తల్లి.

సబ్బులేక మొహం జిడ్డుగా వుంటోంది. నెలకి ఒక్క సబ్బు జాగ్రత్తగా వాడుకుందాం' అంది పెద్దపిల్ల.

'ఇదివరకు కమిటీవారు తగ్గించుట కేర్పాటుచేసింది 450 రూపాయలు. కొత్త పద్ధతివల్ల సాలుకు 225 రూపాయలు తగ్గుతాయన్నమాట' అంది తల్లి.

'రైటే' అన్నారు మితవ్యయం కమిటీ వారు.

'ఇంతవరకు బాగానే వుంది. గాని, మనం డబ్బు సంపాదించే సాధనాలు ఆలోచించాలి. చిల్లరబాకీలు తీర్చెయ్యాలి ముందు' అంది తల్లి.

'బుచ్చెయ్యగారిని బదు లడిగితే సరి' అన్నాడు రెండోవాడు.

'వాడు అప్పు ఇచ్చాడంటే మర్నాడు మన పెరటిగోడకి గుమ్మం కొట్టించి మన నూతిలో నీళ్లు తోడ్డం ప్రారంభిస్తాడు. వాళ్లకి నుయ్యి లేదు. మనం నోరెత్తడానికి వీల్లేదు. అప్పిచ్చాడాయె' అంది తల్లి.

'నిజమే' అన్నారు పిల్లలు.

'మన పొరుగు నరసింహంగారిని అడిగితేనో' అంది పెద్దపిల్ల.

'పెద్దవిశాలభావాలూ అవీ వున్నాయనీ పెద్దమనిషనీ పేరేగాని ఆయనకున్న సంకుచితభావా లెవ్వరికీ లేవు. అదీగాక ఆయన అయినవాళ్లకుపకారం చెయ్యడు' అంది తల్లి.

'అల్లాగా!' అని ఆశ్చర్యపోయారు పిల్లలు.

'పోనీ రామయ్యగారి నడుగుదాం' అన్నాడు రెండోవాడు.

'ఆయనదగ్గర పుచ్చుకోవడంకంటె వుంటేతిని, లేకపోతే పస్తుపడుకోడం మంచిది. ఆయన అప్పయిచ్చాడంటే వాళ్ల కొంప అమ్ముద్దామనే వుద్దేశంతోనే. గుండెల్లేని మనిషి' అంది తల్లి.

'అబ్బా, అంత దుర్మార్గుడా!' అని చీదరించుకున్నారు పిల్లలాయన్ని.

'పోనీగానీ అంచాలు పడితేనో" అన్నాడు పెద్దవాడు.

'తప్పు, తప్పు' అంది తల్లి.

'తమ్ముడి పాతపత్రిక లమ్మేసి కొత్తవి కొనక పోతేసరి' అంది పెద్దపిల్ల తమ్ముడు శ్రీనివాసు నుద్దేశించి.

ఆ అబ్బాయి కొనని పిల్లల పత్రిక లేదు.

'అక్కకి రిబ్బన్లు, పువ్వులు, గాజులు రంగు ధారాలు కొనకపోతేసరి' అన్నాడు అక్కగారి మీద - తనకు పత్రికలు కొనవద్దందని కోపంతో శ్రీనివాసు.

'నాన్న ఫైళ్లు తయారుచెయ్యడం మానేస్తే కొంత సొమ్ము మిగులుతుంది' అన్నాడు రెండోవాడు.

'నాన్న తెచ్చిన రిబ్బనుండ అమ్మేత్తేనో' అంది రమ. ★

## తిక్క చావు

(13-వ పేజీ తరువాయి)

నటిస్తే నాకు మామగారు డబ్బు యివ్వక పోవడంవల్ల బెంగతో చచ్చిపోతున్నానని అందరూ ఆయన్ని చీవాట్లు పెడతారనుకున్నాను గాని, డాక్టరు వచ్చి యిల్లా చావగొడతాడనుకోలేదు' అన్నాడు రమణయ్య వెఱ్ఱిమొగంపెట్టి. 'తేలుకుడితే దవడమీద కొట్టి కొంతమంది మంత్రం వేస్తారు చూశావూ, అల్లాగే డాక్టరుగారు కూడ ఒక్క దవడ దెబ్బతో నీ చావుకు మంత్రంవేశారు బావా!' అంటూ గౌరీనాథంగారి అబ్బాయి రమణయ్యను వేళాకోళం చేశాడు. ★



# విజ్ఞానవీధులు

"డాక్టర్"



## 80. ఉల్కలు:

రాత్రిళ్లు ఆకాశం కేసి చూస్తుంటే నక్షత్రం పడుతోందా అన్నట్లు సన్నని కాంతి రేఖలాగా కనిపిస్తూంటుంది. వెన్నెల రాత్రులలో అంత ఎక్కువగా ఉండవుగాని చీకటి రాత్రులలోను. అందులోనూ నవంబరు నెలలోనూ ఆ కనిపించే కాంతి రేఖలకు పరిమితి ఉండా అనిపిస్తుంది. అవి వెన్నెల ఆరగించే చకోర పక్షుల రెట్టలనీ, నక్షత్రరూపం పొందిన పుణ్యపురుషులు, వారి పుణ్యఫలాన్ని అనుభవించడం పూర్తియైన తర్వాత క్రిందికి త్రోసి వేయబడుతూ అట్లు గోచరిస్తున్నారనీ కొందరంటారు. కాని శాస్త్రజ్ఞానం గలవారు అందుకెందుకూ అంగీకరించరు. ఆ కాంతి ఉల్కలను ఖగోళాలవల్ల కలిగిందని వారు ప్రత్యక్షంగా కనుక్కున్నారు.

గ్రహాలు, ఉపగ్రహాలు వలెనే ఉల్కలుకూడా సూర్యకుటుంబానికి చెందిన మూర్తులు. ఇవి కూడా సూర్యుని చుట్టు దీర్ఘవృత్తాకార కక్ష్యలలో ప్రదక్షిణం చేస్తున్నాయి. కాని గ్రహాలకంటే వాని పరిమాణం చాలా తక్కువ. చిన్న బటాణీ గింజ మొదలు పెద్ద బండరాతివరకు వాటి పరిమాణాలు ఉంటాయి. (ఇక గ్రహాల పరిమాణాలో! అంతకు కొన్ని లక్షల రెట్లుంటాయి)

గ్రహాలవలెనే ఉల్కలకు కూడా సొంత కాంతిలేదు. తమపై పడిన సూర్యకాంతితోనే అవి ప్రకాశించాలి; అయితే అవి చాలా అల్పమూర్తులవడంచేత మన కంటికి ఆనుటకు తగినంత తీక్ష్ణతతో అవి ప్రకాశింపలేకపోతున్నాయి. అందుచేత భూవాతావరణాని కావల ఆకాశంలో ఎక్కడో ఉన్న తమ కక్ష్యలలో తిరుగుతున్నంతకాలం అవి మనకు కనపడవు. ఇక భూమి ఉల్కలూ కూడా వాటి వాటి కక్ష్యలలో సూర్యుని చుట్టు తిరగడంలో ఒకొక్కప్పుడు ఉల్కలు భూమ్యాకర్షణ క్షేత్రమనే వలలో చిక్కుకోవడం తటస్థింపవచ్చు. అప్పుడే అవి మన భూమివైపుకు రావడం అంటే పడడం సంభవిస్తుంది. ఆ సందర్భంలో భూమిచుట్టు ఉండేగాలి రాపిడికా ఉల్క వేడి హెచ్చి, అది ఉజ్జ్వలస్థితిని పొందుతుంది. ఆ స్థితిలోనే ఉల్కలు మనకు కనపడతాయి. అప్పుడే అది ఆకాశానికి అడ్డంగా, కాంతి రేఖగా గోచరిస్తుంది.

ఉల్కలోని ద్రవ్యరాశి మరీ తక్కువైతే వాతావరణాన్నిదాటి భూతలాన్ని చేరుకొనే లోపుననే అది పూర్తిగా ఆవిరియైపోతుంది. చాలా ఉల్కలలు ఇట్టివే. ఇట్టి ఉల్కలను 'మీటియర్సు' అని ఇంగ్లీషులో అంటారు, కాని కొన్ని పెద్ద ఉల్కలు వాతావరణంగుండా ప్రయాణం చేయడంలో పూర్తిగా నాశనంకావు; వాతావరణంలో ప్రయాణంచేసేటప్పుడు ఆవిరియైపోగా మిగిలిన భాగాలు పెటపెటమను కరకరశబ్దంతో భూమిమీద పడతాయి. ఇక హెచ్చువేగంతో అవి భూమి పడడంచేత అవి పడినచోటలోతైన పెద్ద గొయ్యి యేర్పడుతుంది 'అరిజోనా'లో 'కేనన్‌డయబ్లో' వద్ద యేర్పడిన విశాలమైన పగుళ్ళు ఈవిధంగా కలిగినవేనని అంటారు. ఈ 'పగుళ్ళు' రమారమి 4000 అడుగుల నిడివి, 570 అడుగులలోతు ఉన్నాయి. ఉల్కలలో భూతలమును చేరుకొనేవాటిని 'మీటియరైట్సు' అని ఆంగ్ల భాషలో వ్యవహరిస్తారు.

ఎత్తైన కొండలనుండి క్రిందికి దిగజారడంలో నున్నగా అరిగిపోయినరాళ్ళవలె ఉల్కఉంటుంది. రసాయన పరీక్షవలన ఉల్కలన్నీ ఒకేరకపు రసాయన మిశ్రములు కావని తేలినది. ఒకరకం ఉల్కలు కేవలం భూమిమీద దొరికే రాళ్ళవంటివే. ఇంకోరకం ఉల్కలలో ఎక్కువపాలు ఇనుము, అతి తక్కువ పాలు నికెల్ ఉన్నాయి. ఈ రకం ఉల్కలు చాలా బరువైనవి. కాని సామాన్యంగా భూమిపై పడే ఉల్కలలో ఎక్కువభాగం అటు రాతిఉల్కలకు, ఇటు ఇనుప ఉల్కలకు మధ్యమ రచనను కలిగిఉంటాయి.

ఉల్కలు ఎట్లేర్పడ్డాయో ఎవరూ సరిగా చెప్పలేకుండా ఉన్నారు. సూర్యకుటుంబోత్పత్తిసమయంలో గ్రహాలుగా రూపొందగా శేషించిన ద్రవ్యరజమే ఉల్కలుగా యేర్పడినదని చాలకాలం వరకు శాస్త్రజ్ఞులు భావించేరు. కాని ప్రొఫెసర్ బాయిర్ డాక్టరు హారియస్ బ్రౌన్ అను ఇరువురు అమెరికా దేశ శాస్త్రజ్ఞులు భూమికి పొరుగుననున్న ఒక గ్రహం బ్రద్దలై ఉల్కలుగా రూపొందినదని క్రొత్తగా ఒక సిద్ధాంతాన్ని ప్రతిపాదించేరు. కాని ఇంతవరకు శాస్త్రజ్ఞులందరకు సమ్మతమైన సిద్ధాంతం ప్రతిపాదితం కాలేదు.

సాధారణంగా ఒకటి రెండు కంటె ఎక్కువ ఉల్కలు ఒకే సమయంలో కనిపించవు. కాని కొన్ని సమయాలలో ముఖ్యంగా ప్రతిసంవత్సరం ఏప్రిల్ 20–21 తేదీల మధ్యా, ఆగష్టు 10 – 11 తేదీల లోనూ, నవంబరు 13–14 తేదీల మధ్యను ఉల్కలు గుంపులు గుంపులుగా కనపడతాయి. వానినే 'ఉల్కా సంపాతము'లు అంటారు. పూర్వకాలంలో ఎప్పుడో తోకచుక్కలు కొన్ని బ్రద్దలయి, వాటి ముక్కలే నేడు ఉల్కా సంపాతములుగా ప్రత్యక్షమౌతున్నాయని శాస్త్రజ్ఞులూహిస్తున్నారు. —'అనంత్'

## 81. కార్యకారణ సంబంధమంటే ఏమిటి?

నేటి వైజ్ఞానికులు పూర్వులు నమ్మిన వాటికన్నిటికో కార్యకారణసంబంధము లేదంటారు. దృష్టికి పాలువిరిగిపోవడానికీ, శకునానికీ కార్యవైఫల్యానికీ, తుమ్ముకీ విఘ్నాలికీ, పిల్లల అంగవైకల్యానికీ తలిగ్రహణపు చూపు, కాకులకీ అరుపుకీ బంధువుల రాకకీ సంబంధము లేనేలేదం

టారు. అయితే వేటికి వుందీ సంబంధమూ? రెండుఘటనలకి కార్యకారణ సంబంధముండడమనగా ఏమిటి? ఫలాని వాటికి సంబంధమున్నదని నిశ్చయించడానికి పద్ధతు లేమిటి?

మొదటిది సహభావపద్ధతి. అంటేఎప్పుడూ కలిసివచ్చే రెండు కార్యాలికిగాని వస్తువులకుగాని సంబంధము కల్పించేపద్ధతి. వాటికి రెండింటికీ సహభావముండాలి. ఒక ఉక్కుముక్క చుట్టూ రబ్బరులో ఇమిడ్చిన తీగచుట్టి దానిలోంచి విద్యుత్ప్రవాహమును పంపింతే కొంతసేపటికో ముక్క అయస్కాంతమౌతుంది. అంటే విద్యుత్ప్రవాహానికీ కాంతత్వానికీ సహభావమున్నది. ఉప్పుకల్లువేస్తే పాలు విరిగిపోతాయి. అరటిపండ్లు తింటే ఆకలి తీరుతుంది. వేడిమివల్ల వస్తువులు పెరుగుతాయి. గంధకము ఉన్నకూరలు పెట్టి ఉంచితే వెండిపళ్లెము నల్లబడుతుంది. ఇవన్నీ సహభావానికి ఉదాహరణలు. అది ఉన్నప్పుడు ఇది వుంది. కనక రెండింటికీ కార్యకారణ సంబంధముంది. ఎవరో తుమ్మినప్పుడల్లా విఘ్నాలురావు. కాకి అరిచినప్పుడల్లా బంధువులురారు. గ్రహణవేళల్లో భోజనము చేస్తే శూలనొప్పిరాదు. వీటికి సదా సహభావములేదు. కాబట్టి (కార్యకారణ) సంబధమూ లేదు.

రెండోపద్ధతి సమానాభావపద్ధతి అంటే అదిలేనప్పుడు ఇదీ లేకపోవడము. దోమలు లేకపోతే మలేరియా (చలిజ్వరము) రాదు. కంపనము లేకపోతే శబ్దములేదు. నిప్పులేకపోతే పొగలేదు. మబ్బులేకపోతే వాన లేదు. అదిలేకుంటే ఇదిలేదు. కనక వాటికి కార్యకారణ సంబంధముంది.

మూడోపద్ధతి భావాభావ సమానత్వ పద్ధతి. వెలుతురుంటే వజ్రం మెరుస్తుంది. వెలుతురులేకపోతే మెరవదు. రోగక్రిములు శరీరంలో జాస్తిగావుంటే జ్వరం వస్తుంది. ఆ క్రిములు చచ్చిపోతే ఆ జ్వరం రాదు. వీణ తీగ కంపిస్తేనే నాదం రావడము. కంపనాలు ఆపేస్తే నాదం రాదు. వీటి కన్నిటికీ సహభావమూ వుంది, సమానాభావమూ వుంది. కనక వీటికి పరస్పర (కార్యకారణ) సంబంధముంది.

నాలుగోది విలోమ సంబంధపద్ధతి. వస్తువుల సరఫరా ఎక్కువైతే ధర తగ్గుతుంది. అది తగ్గితే ఇది ఎక్కువౌతుంది. పీడనము ఎక్కువచేస్తే (బెలూనులోని) వాయువు పరిమాణము తగ్గుతుంది. పీడనము తక్కువైతే పరిమాణము ఎక్కువౌతుంది. జనము ఎక్కువైతే శేవను తగ్గుతుంది, జనము తగ్గితే శేవను ఎక్కువౌతుంది. కనక వీటిలో వీటికి విలోమ సంబంధము ఉంది.

అయిదోది అదృష్టకారి సంబంధము. తక్కిన గ్రహాలలాగ అండవృత్త మార్గములో తిరుగుతూన్నా ఒకొక్కచోట యురేనస్ అనే (వరుణ) గ్రహము ఈదారి దాటి బయటికి జరుగుతోంది. తెలిసిన కారణాలన్నీ మినహాయించేసి, దీనికి అదృష్టకారణము ఏదో ఉన్నదన్నారు యాడమ్సూ, లెవెరియర్ అనే వైజ్ఞానికులు. దానికోసము వెతికి ఇంద్రగ్రహాన్ని కనుకున్నాడు లెవెరియరు. పట్టుపురుగుల అకాలమరణానికి తెలిసిన కారణాలన్నీ మినహాయించి, వాటిని కోసి చూసి రోగక్రిముల్ని కనిపెట్టాడు పాశ్చరు. సువర్ణపత్ర విద్యుత్సూచని పత్రాలు క్రమంగా వాలిపోడానికి కారణాలు వెతికి వెతికి అంతవరకూ అదృష్టమైన విశ్వమయూఖములను కనిపెట్టాడు హెస్సు.

శాస్త్రీయ పరిశోధనలో కార్యకారణ సంబంధము నన్వేషించడానికి ఈ అయిదే పద్ధతులు. ఇంతకు మించినవేవీ లేవు. ఆధునిక విజ్ఞానమంతటా, ఈ పంచపద్ధతులవల్ల సాధించిన కార్యకారణ సంబంధమే కనబడుతుంది.

—మూర్తి.

"బియ్యం ఒక శేరు యివ్వండి"
"లేదు"
"చక్కెర అర వీశ యివ్వండి"
"లేదు"
"సిగరెట్ ఒక 'ప్యాక్' యివ్వండి"
"అదీ లేదు"
"యింకేముంది?"
"యేదీ లేదు!"
"యింత మాత్రానికి కొట్టెందుకు తెరచావు? తాళం వేసుక పోరాదూ?"
"తాళంకూడా లేదు"

—గోపిశ్రీ

## 82. భూగర్భంలో ఏముందీ?

ఖండాలూ, పర్వతాలూ, సముద్రాల అడుగూ, ఇవన్నీ చేరిన పైపొరకు భూమ్యోపరి భాగమని పేరు. ఇది - గట్టివైతేనేమి మెత్తనివైతేనేమి-, రాళ్ళవల్ల ఏర్పడింది. గట్టివన్నీ 'రాళ్లు' అంటే అందరూ ఒప్పుకుంటారు. మెత్తని ఇసుకా, మట్టీకూడా రాళ్ళయొక్క పొడివల్ల ఏర్పడినవే. కనక భూమి పైపొర రాళ్ళవల్ల యేర్పడినదే అనవచ్చును. దీనిని 'శిలావరణము' అని కూడా అనవచ్చును. భూమిమీదవున్న సముద్ర జలాన్నంతటినీ 'జలావరణము'నీ, గాలిని 'వాతావరణము'నీ, భూమికి పదిమైళ్ళకు పైబడి పలచగావున్న వాయువులను 'స్ట్రెటావరణము'నీ అనడము పరిపాటి.

పలాచని శిలావరణముకింద కరిగిన లావా ద్రవముంటుందని ఒకప్పుడు అనుకునేవారు. గనులలో లోతుకి వెళ్ళినకొద్దీ ఉష్ణోగ్రత అరవై అడుగులకి ఒక డిగ్రీ చొప్పున ఎక్కువౌతుంది. అగ్నిపర్వతాలు ప్రకోపించినప్పుడు లావాద్రవము విరజిమ్మబడుతుంది. కనక ఈ లావా ద్రవమే శిలావరణముక్రింద వున్నదనీ, దీని వేడిమివల్లనే భూగర్భములోనికి పోను పోనూ ఉష్ణోగ్రత అధికమౌతోందనీ అనుకునేవారు. అయితే భూగోళ కేంద్రంలో కరిగిన ద్రవము ఉండడానికి వీలు లేదని ఇటీవల గ్రహించారు. భూగర్భ కేంద్రంలో ఇనుమూ, నిక్కెలూ, ఇతర లోహాలూ చేరి యేర్పడిన ఘనగోళమున్నదనడానికి గట్టి సాక్ష్యాలున్నాయి. ఈ గోళాన్ని 'భారావరణము'న్నారు. దీనినావరించి ఏడువందలమైళ్ళ దళసరిని శిలావరణమున్నది. శిలావరణపు టడుగు పొరలు వేడిగానే ఉంటాయికాని, వాటిని పైనించి ఒత్తే శిలావరణపు టొత్తిడివల్ల ద్రవరూపాన్నకాక ముద్దవలె ఏర్పడి ఉంటాయనడమే సబబు. శిలావరణములోని కదలికలవల్లా దానిలో ఏర్పడిన చీలికలవల్లా, పై ఒత్తిడి తగ్గి, 'ముద్ద' ద్రవమైపోయి, ఆ చీలికలలోంచి లావా రూపంలో బయటికి వస్తుంది. ఇది శిలావరణము నంతటినీ దాటి భూమిమీదికి రాకపోవచ్చును; సగము దూరము వచ్చి ఘనీభవించి పోవచ్చును. తరవాత ఎప్పుడేనా మళ్లీ పై ఒత్తిడివల్లనో వేడెక్కి ముద్దయి, జరిగి, భూమి నెరుసుల లోంచి చొచ్చుకునీ రావచ్చునూ, అగ్ని పర్వత బిలములలోనుంచి దూసుకుని రావచ్చును. నెరుసులలోంచి చిమ్మి గట్టిపడిపోయినప్పుడు ఈ శిలాద్రవము నల్లగానుండి, తెల్ల శేనపు రాతిపొరలలో నల్లని చారలుగా కనబడుతుంది. 'పర్ణశాల' అనే గ్రామమువద్ద ఇలాంటి చారలనే 'సీతమ్మ చీరల రంగులు'ని నేటికీ చూపిస్తున్నారు.



"ప్రేమ జంట"

—చిత్రకారుడు : శ్రీ R. వెంకటరావు.

# విజ్ఞాన వీథులు

## 83. మొక్కల అంగరక్షకులు

ఒకటో అరో తప్ప మొక్కలూ చెట్లూ అన్నీ పుట్టిన చోటునించి కదలలేనివే. కనక నడిచే మృగాలనుంచి వాటికి కాపుదల ఉండాలి. లేకపోతే మొక్కల వృద్ధీ వంశవ్యాప్తీ కష్టమైపోతాయి. చాలా మొక్కల ఆకులు సర్వభక్షణచేసే మేకలూ గొర్రెలకీ తప్ప రుచిగావుండవు. మేకలు తినే తుప్పలు చాలామట్టుకు ముళ్లు పెంచుకుంటాయి. బ్రహ్మజెముడు పొద ఆకులకి బదులు ముళ్లు పెట్టుకుంటుంది అట్టలవంటి తన కాండానికి.

తీగలన్నీ నులితీగల్ని పెంచుకుని పెద్ద పెద్దచెట్లమీదికి ఎక్కిపోయి పువ్వుల్నీ కాయల్నీ అక్కడపెడతాయి. కొన్ని తీగలకి ఆకులకొసలు రావి ఆకుకొసల్లాగ పెరిగి నులితీగల్లాగ పనికివస్తాయి. పెద్దచెట్లకిలాగ బలిష్ఠమైన కాండముగాని తీగల్లాగ సన్నని కాండంగాని లేక మన వ్రేలంత లావుగా వుండి 15 అడుగుల దాకా పెరిగే తుప్పలు కొన్ని ముళ్లనే నులితీగల్లాగ వాడుకుంటాయి. మరికొన్ని, తీగగులాబీవంటివి పూగుత్తి కాడకి నులితీగె పెంచుకుంటాయి.

పెద్దపెద్ద చెట్లు వాటి కాండాన్ని కాపాడుకోడానికి బెరడు పెంచుకుంటాయి. కొబ్బరీ, తాటీ, పోకచెట్లు పువ్వుల్నీ కాయల్నీ ఎక్కడో నెత్తిమీదికి పట్టుకుపోయి పెట్టుకుంటాయి.

'పనెట్టా'లని ఒక రకము మొక్కలున్నాయి. వాటి కాడకి ఇటూ అటూ రెండేసి రెండేసి ఆకులు మొలుస్తాయి. లేతగా ఉన్నప్పుడు ఆకులు నమస్కారం చేస్తున్నప్పుడు చేతుల్లాగ కలిసిపోయిఉండి కొండపు మొగ్గని రక్షిస్తాయి. ఆకులు పెద్దవై విడిపోయేసరికి మొగ్గ పెద్దదౌతుంది.

వేపచెట్టు తన కాయల్ని పక్షులు కొరికేస్తాయని వాట్లో చేదు పెట్టి విత్తనాలు తయారవగానే చేదుని తీపిగా మార్చేస్తుంది. దానిమ్మ, మామిడీ కూడా వగరూ పులుపుల్ని తీపిగా మారుస్తాయి.

అంతరతామర మొక్కని నీట్లోంచి పైకి తీసిచూస్తే వేళ్ళు పూతరంగు వెలిసిపోయిన జుట్టు రంగులో వుంటాయి. ఒక వేరుని విడదీసి, దాని కొసని రెండు వేళ్ల మధ్యనా పట్టి లాగితే స్ప్రింగు లాంటి తొడుగు ఊడి వస్తుంది. ఇది సున్నితమైన వేళ్ళ కొసల్ని దెబ్బతినకుండా కాపాడుతుంది. మర్రి ఊడల కొసల్ని కూడా ఇలాగే బూడిద రంగు స్ప్రింగు లుంటాయి. మొగలిచెట్టు మొదలుకి ఒకటి రెండడుగుల ఎత్తువరకూ కాండమునుంచి వేళ్లు దిగుతాయి. వీటి కొసలను కాపాడడానికి టోపీలుంటాయి.

—తాను వేసిన పైరును పాడుచేస్తుందని కలుపు తీయించేస్తాడు రైతు. "కాని చిన్న తనములోనే వంశ నిర్మూలకుడైన కొడుకుని చంప నివ్వదే ప్రభుత్వమూ?" అంటున్నారే, వంశ నిర్మూలకుడని పసివాణ్ణి తండ్రి నిజంగా పసికట్టగలడంటారా? అలాగ అనుమానించబడిన వాళ్లెందరో గొప్ప వాళ్ళయారు భూత కాలంలో! గ్రీసు దేశపు తల్లులు వరాలు లాగ పుట్టిన బిడ్డల్ని కొండకొమ్మనించి దొర్లించేసే వారట. నేటికి మమకారము బాగా బలిసిపోయింది స్వామీ.

—సినిమా తెరమీద వెల్తురు నిరంతరాయముగా పడదు. రీలులోని బొమ్మ ఒకటి తెరమీదపడిన తర్వాత దాని తర్వాతి బొమ్మ అదే స్థానములోకి వచ్చేదాకా వెల్తురుని ఒక బిళ్ళ అడ్డేస్తుంది. బొమ్మలు ఒకటి తర్వాత ఒకటి అదే స్థానములోనికి వచ్చినప్పుడే వెల్తురు ఆ బొమ్మలోంచి దూరి తెరమీదపడుతుంది. ఇక, మీరు చెయ్యి కదిపినప్పుడు ఆ చెయ్యి సినిమా లైటు వెల్తురువల్లే కదా కనపడుతుంది. కనక ఉండీ ఉడిగీ పడే వెల్తురులో చెయ్యి కనపడీ కనపడకా, మళ్ళీ కనపడీ, ఇలాగ అయిదారు వేరుచోట్లలో కనబడుతుంది. అంటే అనేక చేతులుగా కనపడుతుంది. అయితే తెరమీద బొమ్మలు కూడా ఎందుకలాగ కనపడవూ? అంటారా? తెరమీద బొమ్మలు సెకనుకి 16 చొ॥ మారిపోతాయి. కంటికి ఈ మార్పు నిరంతరాయముగానే కనపడుతుంది. చేతి బొమ్మలు తెరమీది బొమ్మలలాగే సెకనుకి 16 చొప్పునే కనబడతాయి. అయితే మీరు చెయ్యి కదుపుతున్న కాలములో ఎన్ని బొమ్మలు దాటిపోతాయో అన్ని చేతులే కనబడతాయి.



సాంచిలోని నూతన చైత్యగిరి విహారం.

ఇంగ్లండుకు తరలించుకు పోబడ్డ సారీపుత్ర, మొగ్గలానుల (బుద్ధుని ప్రథమ శిష్యులు) అస్థికలను యిటీవల స్వదేశానికి తీసుకొనివచ్చి యీ నూతన చైత్యంలో శాశ్వతంగా నిక్షిప్తం చేశారు.

# బొమ్మరిల్లు

## నక్క జిత్తులు ★ శ్రీ వేమల వేంకటఅప్పారావు

[దండకారణ్యంలో ఒకనాడు]



సింహం (ప్రవేశించి)
ఈ అడవికి రాజు నేను!
ఈమృగములు నాదు ప్రజలు!
నేనుకన్ను విప్పినచో-
ఈ నిఖిలము మండిపోవు!
[వెళ్లిపోతుంది].

నక్క (ప్రవేశించి)
ఈ అడవికి మంత్రి నేను!
ఈ మృగములు నాదు ప్రజలు!
నా తెలివియె కడు గొప్పది!
నన్ను మించు వారులేరు!

పులి (ప్రవేశించి)
నక్క బావగారా? మీ
రెక్కడ కెళ్లారండీ?
ఈమధ్యను మీ దర్శన
మే దొరకక పోయెకదా!

క:- నమస్తే! నమస్తే! వ్యా
ఘ్రము! అరణ్య సైన్యాధిప!
ఈమధ్యను ఆరోగ్యము
ఏమాత్రము బాగులేక
రాజాలక పోతినిటకు,
నాదోషము క్షమియించుడు!

పులి:- ఎంతమాట! ఎంతమాట!
వింతకదా మీ ధోరణి!
మంత్రులను క్షమించుట సా



మాన్యము కాదండోయ్!
మీ యారోగ్యము బాగుగ
నేయున్నది కద యిప్పుడు!
నక్క:- చిత్రము! మీ దయచేతను
చిత్తమునకు శాంతి కలిగె!...
మీ ముఖమును చూడగ నా
కేమో అనుమానమాయె!
పులి: ఏ మట్టుల అనుచుంటిరి?
నా ముగమున నేమున్నది?
నక్క:- నాదగ్గర దాచకుడు! వి
షాదము కన్పడు చున్నది!
మృగరాజగు సింహమునకు
మీ మీదను ప్రేమకదా!
పులి:- ఏమి మైత్రియో కాని!
ఏమాత్రము సుఖములేదు!
ఈ సింహముతో వేగుట
ఎన్నాళ్లోకద! బావా!
నక్క:- బావగారికే దుఃఖమ?
పరీక్ష చేయుటకై యిటు
పలుకుచు నున్నారో? నా
ప్రభు భక్తిని తమరెఱుగరొ?
పులి:- హాస్యముకాదీ సంగతి!
హర్యక్షమునకు నిత్యము
ఆహారము కూర్చలేక
అవస్థ పడుచుంటినయా!
నా దురవస్థను చూడగ
నాకే సిగ్గగుచు నుండె!
నక్క:- (పైకి కన్నీరు కార్చుతూ-తనలో)
భలే! భలే! బాగున్నది!
పులి మాంసము తినవలెనని
తలచుచుంటి కదా! ఇపుడె
కలహ బీజములు నాటెద!
పులి:- మాటలాడ వేమయ్యా!
నీటుగ మా నక్కబావ!
నీ కన్నీరును చూడగ—
నాకే దుఃఖము జనించె!
నక్క:- ఏమందును పులిబావా!
ఎంతటి బలశాలి వీవు!
నీవు తలచుకొన్న యెడల
నీకడ్డే లేదు కద్దా!
నీయంతటి బలవంతుడు
నీచుల సేవించుటేల?
పులి:- ఔనౌ నా మాట నిజము!
ఐన నిప్పుడేమిచేయు
ముందువు? ఓ మంత్రివరా!
తొందరగా త్రోవచూపి
సందేహము తీర్పవయా!
ఎందులకీ ఆలస్యము?
నక్క:- నిజముగ నా సలహాపై
నీకు నమ్మకము కలదా?
పులి:- ఎంతమాట! ఇంతకు మా
మంతిరినే నమ్మనటోయ్?
నక్క:- ఐతే, నాకడకు రమ్ము!
అద్భుత మార్గము చెప్పెద!
నేక్షే నీజయము సుమా!
గోడలకును చెవులుండును!
పులి:- (నక్కకు చాలా దగ్గరగా వస్తుంది)
ఆ ఉపాయమేదో నిర
పాయమైన దగుచో, వే
గమె చెప్పుము! ఇటుపైనా
కష్టంబులు తీరవలయు!
నక్క:- (పులిచెవిలో నెమ్మదిగా)
మృగరాజగు సింహంబును
మీరిప్పుడు చంపవలయు!
పులి:- (చెవులు మూసుకొని)
శివ! శివ! ఇది ఏమిమాట?
చెడుగుకదా! పాపము కద!
నక్క:- (నవ్వి) ఐతే నీయిష్టము! నే
పోతానోయ్, పులిబావా!
నీలలాట రేఖ తుడువ
నీరజ గర్భుడు చాలడు!
పులి:- వేరే మార్గము లేదా?
నక్క: నహీ! నహీ! బిల్ ఖుల్ నహీ!
పులి:- సింహమును వధించుటయన
చిన్న చిన్న మాటకాదు!!
ఆ ఉపాయమేదో నీ
వే చెప్పుము నక్కబావ!
నక్క:-సింహమిపు డెచటనున్నది?
పులి:- అడవిలో తిరుగుచున్నది.
నక్క:- అదృష్టవంతుడ వయ్యా!
ఆలస్యము చేయకు! సిం
హము వసించు గిరి గుహలో
పొంచియుండు! పులిరాజా!
సింహము రాగానె హఠా
త్తుగ మీదికి దూకి చంపు
పులి:- ఓహోహో! నక్కబావ!
వ్యూహంబులు పన్నుటలో
ఘనుడవుకద! గెలిచినచో
అర్ధరాజ్య మిత్తు నీకు!
నక్క:- ప్రభువులదయ! సింహము
రాకుండ మునుపె పోవలయును!
పులి:- ఇదె పోవుచు నుంటినయా!
నక్కబావ! వేగముగా (వెళ్లి పోతుంది)
నక్క:- భలే! భలే! నాజిత్తులు
పారినవీ పులి దగ్గర!
సింహముకీ వార్త చెప్పి
చెండాడెద పెద్దపులిని!
(దూరంగా సింహ గర్జన వినిపించి, దగ్గరౌతుంది)
వైద్యుడు పథ్యము చెప్పిన
పాలే రోగియు కోరిన
విధముగ మృగరాజ చటకు
వేగముగా వచ్చుచుండె!
సింహం (ప్రవేశించి) నక్కబావ గారూ! మీ
రెక్కడ కెళ్లారండీ!
ఈమధ్యను మీ దర్శన
మేదొరకక పోయెకదా!
నక్క:- నమస్తే! నమస్తే! సిం
హము! అరణ్య రాజ్యాధిప!
ఈమధ్యను ఆరోగ్యము

# ★ నక్క జిత్తులు ★

ఏమాత్రము బాగులేక
రాజాలక పోతి నిటకు –
నాదోషమును క్షమించుడు!
సింహం!- ఇప్పుడు సుఖముగ
నున్నవ?
ఏమైనను వింతలున్నా?
నక్క:- (కన్నీరు కార్చుతూ)
నా రోగము తగ్గె గాని
మీరా వ్యాఘ్రము కోటను...
(అని, చెప్పలేక, ఏడ్చి
నట్లు నటిస్తుంది.)
సింహం:- ఏమంటివి నక్కబావ!
వ్యాఘ్రము తొలుతటినుండియు
ప్రభువిశ్వాసము కలదని
మంత్రివి నీ వెఱుగ వాకో!
నక్క:- కాదనగలనా? రాజా!
కాదని – ఈనాటి పెద్ద
పులిదురూహాలను గ్రహించి
కూడ మిన్నకుందునో కో!
సింహం:- భయ మున్నదెఱుగని నాకు
భయము పుట్టుచుండె నేడు!
వ్యాఘ్రోదంతము సర్వము
శీఘ్రముగా చెప్పుమయా!
నక్క:- అవధరింపు మహాప్రభూ!
ఆ పులి యెంతటి చెడ్డదో!
సింహం:- నక్క వినయములను దాచి
నాకు యథార్థమును చెప్పు!

నక్క:- చిత్తము! చిత్తము! రాజా!
ప్రభుదర్శనమును కోరుచు
ప్రభువులైన తమ వసించు
కొండగుహకు వెళ్ళినాను!
సింహం:- ఎప్పుడు?
నక్క:- ఇప్పుడె!
సింహం:- పిమ్మట
యేమైనది? చెప్పవయా!
నక్క:- చిత్తము! చిత్తము! రాజా!
గుహలో సైన్యాధిపుడగు
పులిరాజు భయంకరుడై
పొంచియుండె నేమందును!!
సింహం:- ఆఁ! ఆఁ! ఇది నిజముగునా?
నక్క:- మీతోడు! మహారాజా!
మిమ్ము చంపి ఈ అడవికి
సార్వభౌముడగునట! ఆ
ఛండాలుడు వ్యాఘ్రరాజు!
సింహం:- పద! పద! వ్యాఘ్రమును
చంపి
ముదముగ విందొనరింతము!
[సింహమూ, నక్కా నిశ్శబ్దంగా నడచి సింహభవనమైన కొండ గుహను చేరుకుంటవి. హఠాత్తుగా సింహం పులిమీద దూకి పంజాతో పులి మెడను చీల్చుతుంది. ఎంత రక్తం! పులి నేలమీద పడిపోతుంది.]

ఓరీ! వ్యాఘ్రాధమా! నీ
వైరము నాతోనటరా?
పులి:- చచ్చితిని! మహారాజా!
ఉచ్చువంటి నక్కజిత్తు
తెలియగక చెడిపోతిని! ఈ
గిరిగుహలో పొంచి, మిమ్ము
పరిమార్చగ పురికొల్పెను!
మంత్రియైన జంబుకుండు!
ప్రాణము పోయెడు వేళ అ
బద్ధములు వచింపజాల!
(చచ్చిపోతుంది)
సింహం:- ఓరోరీ! మాయ నక్క!
కరటక దమనక నీతిని
ప్రయోగించి, మామధ్యను
వైరము కల్పించినావు!
సైన్యాధిపతిని చంపిన
శాశ్వత పాపంబు నాకు
కలిగెను నీమూలముగా
తెలిసెను లే! నీ జిత్తులు!
[నక్కపై దూకి ఒక్క
దెబ్బతో చంపుతుంది]
పులిరాజును కోల్పోతిని!
తెలియక పోతిని మోసము!
ఈ జిత్తులమారి నక్క
ఎంత చేసె నయ్యయ్యో!!
[ఏడుస్తుంది]
★



సీరియల్

# విచిత్రవ్యక్తి

మూలం :- మార్క్ట్వేన్

**జరిగినకథ:**—ఆస్ట్రియాలోని ఈ జెల్ డార్ఫ్ మా స్వగ్రామం. నా యీడు వాళ్లైయిన సెప్పీ, నికొలాస్ అనే మరి ఇద్దరు బాలురతో కలిసి ఎప్పుడూ అడవుల్లో, కొండల్లో తిరిగేవాణ్ణి. ఒక రోజున మేము ఒక కొండమీద మా ఆట స్థలంలో కూర్చుని ఉండగా ఒక కొత్తవ్యక్తి వచ్చాడు. తన పేరు సైతాను అనీ, తను దేవతననీ చెప్పాడు. మాకు చాలా వింతలు చేసి చూపించాడు. అతడు మాతో ఉన్నంతసేపూ మానవజాతిని నానాబూతులు తిట్టాడు. మానవులు తామేదో గొప్పవారమని అనుకుంటారుగాని నిజానికి వారిలో ఉన్న నైచ్యం ఇంకెక్కడా ఉడదని అన్నాడు. చివరికి మాయమైపోయాడు. మావూళ్లో ఫాదర్ పీటర్ అని ఒక మతగురువు ఉన్నాడు. ఆయన ఏ నేరమూ చెయ్యకపోయినా, పదవినుండి తొలగించబడ్డాడు. ఆయనకి సహాయం చేద్దామనో, ఏమో సైతాను పదకొండువందల బంగారు నాణాలు ఆయనకి దొరికేట్టు చేశాడు. ఫాదర్ పీటర్‌కు విరోధియైన ఒక జ్యోతిష్కుడు ఆడబ్బు తన దగ్గరనుండి దొంగిలించబడిందని ఆరోపణచేశాడు. వెంటనే ఫాదర్ పీటర్‌ను జైల్లో పడేశారు. ఆయన కుటుంబానికి సైతాను మళ్లీ సహాయంచేశాడు. ఆ సహాయం ఎవరు చేస్తున్నారో తెలియక గ్రామస్థులు తికమకలు పడి ఫాదర్ పీటర్ కుటుంబానికి సైతానుతో సంబంధమున్నదని అనుమానించారు. ఆసంగతి పరీక్ష చెయ్యటానికి నిశ్చయించారు. కాని సైతాను మాయచేసి వారిని కికురించాడు తప్ప రహస్యం బయట పడనివ్వలేదు.

చైనా అనగానే ఆశ్చర్యం, సంతోషం, గర్వం ఒక్కసారిగా కలిగాయి. మా వూరునుంచి ఎంతదూరం వచ్చానో! నాకంటె అదృష్టవంతుడు మరి లేడనిపించింది. మావూళ్లో అందరికంటె ఎక్కువ దేశాలు తిరిగినమనిషి ఒకడున్నాడు. వాడికి తను గొప్ప దేశసంచారినని చచ్చేగర్వం. కాని వాడు కూడా ఇంతదూరం తిరిగి వుండడు. వాడిజన్మలో ఇంతదూరం రాలేదు కూడాను. నేను కొన్ని వేల మైళ్లదూరంలో ఉన్న చైనాదేశం కూడా వెళ్లి వచ్చానని తెలిస్తే వాడిగర్వం పటాపంచలౌతుంది.

చైనాసామ్రాజ్యం యావత్తూ ఒక అరగంటలో పర్యటించాం. చూడవలసిన విశేషాలన్నీ చూశాం. కొన్నికొన్ని దృశ్యాలు అద్భుతంగా, కొన్ని దృశ్యాలు అసహ్యంగా ఉన్నాయి. అలా తిరిగి తిరిగి కొంతసేపటికి ఒక కొండ శిఖరాన వ్రాలి కూర్చున్నాం. మేము కూర్చున్న చోటినించి ఎన్నో కొండలు, కోనలు, నదులు, మైదానాలు, పట్టణాలు, పల్లెలు, ఒకవైపున సముద్రం కనిపిస్తున్నాయి. ఆ విశాలమైన దృశ్యం కళ్లకి పండుగగా, హృదయానికి వెన్నెలగా, ఎంతో ప్రశాంతంగా ఉన్నది. ఈమాదిరిగా అనుకున్నప్పుడల్లా దూరదేశాలకి వెళ్ళగలిగితే, ఎంత బాగుండును! ఎప్పుడూ కూపస్థ మండూకాలవలె ఉన్నచోటే ఉండకుండా కొత్తచోట్లకి వెడుతూ ఉండటంవలన జీవితభారం ఈబుజం మీంచి ఆ బుజంమీదికి మార్చుకున్నట్టయి మనస్సు ఎంత తేలికపడుతుంది!

నేనూ సైతాను కబుర్లలోకి దిగాము. సైతాను ప్రవర్తన ఏవిధంగానైనా సంస్కరించాలనే ఆలోచన కలిగింది. అతడు చేస్తున్న పనులు నాకేమీ నచ్చ

 అనువాదం : శ్రీ నండూరి రామమోహనరావు 

లేదనీ, అతనిమూలంగా ఎందరు కష్టాలపాలౌతు న్నారో ఆలోచించుకోమనీ చెప్పాను. అతడు మానవుల కపకారం చెయ్యాలని ఉద్దేశించకపోయినా, చేసే పనులవలన దుష్ఫలితాలు మాత్రమే కలుగుతున్నాయని చెప్పాను. ఏ పనిచేస్తే ఎవరికేఫలితాలు కలుగుతాయో ఆలోచించుకుని మరీ పనులు తలపెట్టమని అన్నాను.

సైతాను నవ్వాడు: "ఏమిటి నువ్వనేది? పిచ్చివాడా! నేనుచేసే పనుల ఫలితాలు నాకు తెలియవంటావా? బలేవాడివే!"

"నీపనులవల్ల కలిగే ఫలితాలు నీకు ముందే తెలిసేటట్టయితే, ఇవన్నీ ఎందుకు చేస్తున్నట్టు?"

"చెప్పమంటావా? విను. మీజాతి చిత్రమైన జాతి. మానవుడు యంత్రంలాంటివాడు. ఈయంత్రంలో ఒకభాగం దుఃఖాన్ని తయారుచేస్తుంది. మరొక భాగం సంతోషం తయారుచేస్తుంది. చాలామందికి ఈయంత్రం సుఖదుఃఖాలను సరిసమానంగా తయారుచేసి పెడుతుంది. ఒకవేళ సమానంగా తయారుచెయ్యటానికి వీల్లేకపోతే దుఃఖాన్నే ఎక్కువ తయారుచేస్తుందిగాని సుఖాన్నికాదు. కొందరు మనుషుల తత్త్వాన్నిబట్టి దుఃఖం ఉత్పత్తిచేసే యంత్రభాగానికి ఊపిరి సలపకుండా పని పడుతుంది. అటువంటివాళ్లు జీవితంలో సంతోషంఅంటే ఏమిటో ఎరక్కుండానే బతుకుతారు, చస్తారు. వాళ్లేం ముట్టుకున్నా, ఏం చేసినా దుఃఖమే తయారవుతుంది. వాళ్ళకి జీవితం గుదిబండగా, సర్పబంధంగా, శాపఫలితంగా అనిపిస్తుందిగాని దేవుడిచ్చిన వరం అనిపించదు. అటువంటివాళ్లు ఉండరంటావా? ఓ. కావలసినంతమంది ఉన్నారు. ఒక్కొక్కసారి ఒక్కొక్కమనిషికి ఒక గంటసేపు అనుభవించిన ఆనందానికి బదులుగా కొన్ని సంవత్సరాల బాధామయ జీవితం లభిస్తుంది. ఏం, తెలిసిందా? ఇప్పుడు చెబుతావిను. మీ గ్రామ ప్రజలు నాకేమీ కారు. నాదృష్టిలో వాళ్లకేమీ విలువలేదు. ఒప్పుకుంటావా?"

"కావచ్చు," అన్నాను ముక్తసరిగా.

"కావచ్చేమిటి? నిజంగానే వాళ్ళకీ నాకూ ఎక్కడా సాపత్యంలేదు. వాళ్ళకీ నాకూ ఆకాశమంత తేడా వున్నది. ఉదాహరణకి చెబుతాను, వాళ్లకి మెదడులేదు."

"మెదడులేదూ?" అని ఆశ్చర్యపోయాను.

"అబ్బే. ఏకోశానా మెదడులేదు. నీకు ముందు ముందు వివరించిచెబుతాను, మనిషి గర్వంగా చెప్పుకునే మనస్సు అనే పదార్థం ఏమిటో, ఆ అంధకార అయోమయకూపం ఎలా వుంటుందో—అన్నీ తరవాత వర్ణిస్తాను. మానవులకీ నాకూ పోలికలేదు. వాళ్లకేవో క్షుద్రభావాలు, క్షుద్రసంతోషాలు, దుఃఖాలు, గర్వాలు, అతిశయాలు వస్తూంటాయి, పోతూంటాయి. వాళ్ల క్షుద్రజీవితం ఒక చిరునవ్వు, ఒకనిట్టూర్పు, ఒక రెప్పపాటులాంటిది. వాళ్లకి అసలు జ్ఞానంలేదు, ధర్మాధర్మ విచక్షణజ్ఞానంతప్ప. ఈచీమనిచూడు. దీన్నిచూసి ఒకఏనుగు ఏమనుకుంటుంది? ఈచీమ సుఖంగా ఉందో, కష్టాల్లోవుందో, దానికి పెళ్లాంబిడ్డలు, తలిదండ్రులు ఉన్నారో లేదో, మంచి ఉద్యోగం చేస్తోందోలేదో, దాని రాజకీయ ఆశయాలు సఫలం అవుతాయో లేదో, దానికి పడిసెం పట్టిందో, తలనొప్పి వచ్చిందో—ఇవన్నీ ఆలోచిస్తుందా ఏనుగు? ఊహు. ఏనుగు బ్రహ్మాండమైన జంతువు. దానికి చీమ జీవితం గూర్చి ఆలోచించవలసిన అగత్యంలేదు; తన ఆలోచనలను చీమ పరిమాణానికి కుదించుకోవలసిన అవసరం దానికి లేదు. అంతేగాక చీమమీద కోపగించుకుని ద్వేషించవలసిన పనికూడా లేదు. నాక్కూడా మానవునిపై కోపం లేదు. ఏనుగుకు చీమపై లక్ష్యంలేదు. నాక్కూడా మానవునిపై లక్ష్యంలేదు.

ఏనుగు వంద ఏళ్లు బతుకుతుంది. చీమ ఒక రోజే బతుకుతుంది. బలంలో, బుద్ధిలో, తీవిలో ఏనుగుకూ, చీమకూ ఎంతో భేదం ఉన్నది. మానవుణ్ణి నన్నూ పోలిస్తే చీమకూ ఏనుగుకూ గల భేదంకంటే ఎన్నోరెట్లు భేదం కనిపిస్తుంది.

మానవుని మనస్సు బహు వోపిగ్గా ఆ ముక్కా యీ ముక్కా కలిపి చీకిరిబాకిరిగా ఏదో తయారుచేస్తుంది. కాని నా మనస్సు సృష్టిస్తుంది! అర్థమైందా, సృష్టించడమంటే ఏమిటో? ఏది కావాలంటే అది, ఒక చిటికెలో సృష్టిస్తుంది! ఏ ముడివస్తువూ అక్కర్లేకుండా సృష్టిస్తుంది. ఘన, ద్రవ, వాయు పదా

(౫౩-వ పేజీ చూడండి)

# మల్లినాథ సూరి

రాత్రి భోజనాలయ్యాక వెన్నెట్లో చల్లగాలికి పక్క లేసుకొని పడుకున్నాం. మా తమ్ముడు నా పక్కన జేరి "అక్కయ్యా! నిద్దర రావటం లేదు; కథ ఏదైనా చెప్పవూ?" అంటూ అడిగాడు. అది వాడికి రోజూ అలవాటే. అందుకని నాకు విసుగేసింది. "వెధవా! రోజూ నీకోసం కథలు సృష్టించడానికి యిక్కడ ఎవరు తీరిగ్గా కూర్చున్నారురా? మాట్లాడకుండా పోయి పడుకో!" అని గదమాయించేశాను.

వాడు కాస్సేపు ఊరుకున్నట్టే ఊరుకుని "అక్కయ్యా; మరి-మీ సంస్కృతపు మేస్టారు-రోజూ మొదట్లో ఒక పద్యం చదివిస్తాడు- "జ్ఞానానంద మయందేవం" అని,-దాని అర్థం ఏమిటే? అల్లా రోజూ అదే పద్యం చదవటానికి మాత్రం నీకు విసుగువెయ్యదుటే?" అని తన ధర్మ సందేహాన్ని వెళ్ళబెట్టాడు.

"ఓరినీ!! అదేమిటనుకున్నావు? హయగ్రీవోపాసన. దానివల్ల సకల విద్యలూ వస్తాయి" అన్నాను.

"అసలా హయగ్రీవు డెవరే?" అన్నాడు ఉత్సాహంగా. "హయగ్రీవుడా! విష్ణుమూర్తి ఒకప్పుడు అశ్వరూపం ధరించేడు. అది ఎల్లాంటి గుఱ్ఱం అనుకున్నావు! తె...ల్ల...ని గుర్రం. దాని పేరే హయగ్రీవము" అన్నాను.

"అయితే, అక్కయ్యా! అన్ని విద్యలూ వస్తాయన్నావు; బండ లెక్కలు కూడ వస్తాయిటే?" అని అడిగాడు-(లెక్కలు వాడికి ఎంతకీ కొరుకు బడటం లేదు లెండి!)

"ఓస్! వెధవ లెఖ్ఖలో లెఖ్ఖ? నీకన్నా మొద్దబ్బాయి,- ఆ మల్లినాథ సూరికే హయగ్రీవుడు సకల విద్యా పారంగతుణ్ణి చేసేశాడు" అన్నాను.

"ఏమిటో, నువ్వు చాలా కొత్త కొత్త పేర్లు చెపుతున్నావు యీవేళ! ఇంతకీ ఆ మల్లినాథ సూరి ఎవరు?

శ్రీమతి డి. పార్వతి

మా మేస్టరు వాణ్ణి ఎప్పుడూ మాతో జతచేసి చెప్పలేదే!" అన్నాడు.; ఆ మల్లినాథుడు తన సహపాఠి అయినట్లు.

"ఓరి బడుద్ధా యీ! మల్లినాథు డెవ రనుకున్నావ్? అతడొక గొప్ప విద్వాంసుడు. మహాకవి కాళిదాసు వ్రాసిన 'రఘువంశము' 'కుమారసంభవం' 'మేఘసందేశం' లాంటి గొప్ప గొప్ప కావ్యాలకి వ్యాఖ్యానాలు రచించిన వ్యక్తి" అన్నాను.

"మరి ఆయన నాకన్న బండ బడుద్ధాయి అన్నావు కదా? అల్లాంటి వాడు వ్యాఖ్యానాలు ఎట్లా రాయగలిగేడే?"

"అదంతా ఒక పెద్ద కథ. రేపు చెప్తాలే; యీపాట్టికి పడుకో"

"అక్కయ్యా! మంచి దానివే; కథ చెప్పవూ? లేకపోతే నాకు తెల్లవార్లూ నిద్ర పట్టదే" అని మారాం చేశాడు.

"అయితే చెప్తాగాని మధ్యలో అడ్డుప్రశ్న వేయక విను"

"ఒకానొకప్పుడు ఒక తెలుగు గ్రామంలో ఒక గొప్ప పండితు డుండేవాడు. ఆయనకి లేక లేక ఒక కొడుకు పుట్టాడు. అతడికి మల్లినాథుడని పేరు పెట్టారు. "పండిత పుత్ర శుంఠః" అన్న లోకోక్తికి దీటు పోకుండా ఈ పుత్ర రత్నం పరమ శుంఠగా తయారైనాడు. నా అంతటి పండితుడికి యిల్లాంటి దౌర్భాగ్యమా కలిగేదేమా అని పాపం-ఆ బ్రాహ్మడు కుమిలి పోయాడు. ఇట్లా వుంటూ వుండగా కొంత కాలానికి ఈ కొడుక్కి పెళ్లీడు వచ్చింది. ఒక పొరుగూరి బ్రాహ్మడు అబ్బాయిగారి గుణగణాలు తెలిసికోకుండానే, అబ్బాయి తండ్రి పెద్ద పండితుడు కదా అన్న నమ్మకం కొద్దీ తన పిల్లనిచ్చి పెళ్ళి చేసేశాడు.

"కొన్నాళ్లకి అల్లుణ్ణి పండక్కి తీసి కెళ్లేరు. అత్తవారింట మన మల్లినాథుడు దిట్టంగా ముప్పొద్దులా పిండివంటలు ఆరగించి శుభ్రంగా పడి నిద్ర పోయేవాడు. మల్లినాథుని భార్య మంచి తెలివిగలది;

# ★ మల్లినాథసూరి ★



బాగా చదువుకున్నదీను. తల్లీ కూతుళ్ళకి అబ్బాయి తిని పడుకుంటాడే కాని విద్యా వ్యాసంగం లేదేమో - అని అనుమానం కలిగింది.

"రోజూ రాత్రి పూట మల్లినాథుని మామగారు పురాణ కాలక్షేపం చేసేవాడు. ఒకరోజు ఆయన ఏదో పని మీద పొరుగూరు వెళ్ళేడు. అల్లుణ్ణి పరీక్షించడానికి మంచి అవకాశం కలిగింది అత్తగారికి. "నాయనా ఇవ్వాళ్టికి నీవు చదువు పురాణం" అని వ్యాస పీఠం, తాటి ఆకుల పుస్తకం, తమలపాకులు, వక్కలు అన్నీ సిద్ధ పర్చింది. కూతురితో సహా అతి శ్రద్ధగా పురాణం వినడానికి వచ్చి కూర్చుంది.

"మల్లినాథుడికి, "ఓ"కి ఎన్ని వంకర్లున్నాయో కూడా తెలియదామె! ఇంక పురాణమేం చదువుతాడు? అందుకని కట్ట తమలపాకులు తాపీగా కూర్చొని నమిలేసి వ్యాస పీఠాన్ని అటూ, ఇటూ తిప్పి, పుస్తకం తలక్రిందుగా తెరిచాడు. ఆ తాటాకు పుస్తకంలో ఒక ఆకు తర్వాత మరో ఆకు తిరగేస్తూ ఆవలించటం, చిటికె వేయటం సాగించాడు. దాంతో అబ్బాయిగారి బండారం బయట పడింది. భార్య "పలాశ కుసుమోయాథా" అంటూ లేచింది. అత్తగారు "నిద్ర వస్తున్నట్లున్నది, పడుకో నాయనా" అంటూ పుస్తకం మూసేసింది.

"మల్లినాథునికి భార్య అన్న పదానికి అర్థం అయితే తెలియ లేదు కానీ, ఆ ముక్క బాగా జ్ఞాపకం పెట్టుకు పడుకున్నాడు. మర్నాడు యాయవారాని కొచ్చిన బ్రాహ్మణ్ణి పిలిచి "అయ్యా! 'పలాశ కుసుమోయథా' అంటే అర్థమేమిటి?" అని ప్రశ్నించాడు. ఆయన-"ఓరి పిచ్చివాడా! మోదుగ పుష్పంలాగా చూడ సొంపే కాని వాసన లేదని అర్థం" అని వ్యాఖ్యానించాడు.

"దాంతో మల్లినాథునికి ఎక్కడ లేని రోషం పుట్టుకొచ్చి "ఛీ వెధవ జన్మ! విద్య రానందుకు కదా, నా భార్య నన్నింత చులకనగా మాట్లాడింది!! యేమైనా పండితుణ్ణి కాందే ఆమె ముఖం చూడరాదని" శపథం పట్టి, యకాయకి విద్యల

పుట్టిల్లయిన కాశీకి బయలుదేరి వెళ్లేడు.

"అక్కడ-కాశీలో-తన తండ్రికి ముఖ్య స్నేహితుడైన ఒక విద్వాంసునిజేరి, తనకు విద్యా దానం చేయమని కాళ్లమీద పడ్డాడు. అబ్బాయి గారి వ్యవహారం తెలియక ఆయన "తర్కం మొదలు పెట్టనా? వ్యాకరణం మొదలు పెట్టనా?" అని ప్రశ్నించాడు.

"అయ్యా నాకు ఓనమః దగ్గర నుంచీ నేర్పాల్సిందే" నని విన్నవించగా, ఆయన ఆశ్చర్యపోయి, "సరే" నని ఒప్పుకున్నాడు.

"కొన్ని సంవత్సరాలు గడిచాయి; కాని మల్లినాథుని చదువు ఓనమాల నించి పైకిపోలేదు; కాని పట్టుదల వృద్ధి అయింది. తనకిక చదువు రాకపోతే ప్రాయోపవేశం చేస్తానని ఒకనాడు ముక్కుమూసుకు గంగలో కూచున్నాడు. గురువుకి యితనిమీద జాలి గలిగి "నాయనా! మల్లినాథా! నిరాశ పడక నే చెప్పినట్లు చెయ్యి. ఇవ్వాళ వుపవాసముండి మన పశువుల శాలలో మూలనున్న గదిలో కూర్చో. ఆగది నిండా గుగ్గిళ్లుంటాయి. అర్ధరాత్రి వేళ ఒక తెల్లని గుర్రం అందులోకివచ్చి ఆ గుగ్గిళ్లు తింటూ వుంటుంది. అప్పుడు దాని నోటినుంచి తెల్లని నురుగు వస్తుంది. ఆ నురుగుని నువ్వు అసహ్యించుకోకుండా భక్తితో తాగు. నీకు అన్నివిద్యలు వస్తాయి" అని చెప్పేడు.

"ఆ విద్వాంసుడు గొప్ప హయగ్రీవోపాసకుడు. ఆయన భక్తికి మెచ్చి రోజూ హయగ్రీవుడు స్వయంగా వచ్చి గుగ్గిళ్లు తినిపోతూ ఉండేవాడు. ఆయన చెప్పిన ప్రకారం మల్లినాథుడు ఆ గుగ్గిళ్ల గదిలో కూర్చున్నాడు. అర్ధ రాత్రయింది. పెద్ద జ్యోతి వెలిగింది. గజ్జెల గలగల మ్రోతలు వినిపించాయి. మెఱపుకి మల్లే ఒక పెద్ద అశ్వరాజం కళ్లకు కట్టింది. మల్లినాథుడు ప్రమత్తుడై దానిని కనిపెట్టు తున్నాడు. ఆ గుర్రము గుగ్గిళ్లు తినడం మొదలు పెట్టింది. కొంత సేపటికి దాని నోటి సందుల గుండా నురుగు పాల పొంగులా పైకి రాసాగింది. ఆ నురు

(56-వ పేజీ చూడండి)

## సిక్కుల అద్భుత సమాధి

"మెగ్రిగోరు"అనే విద్వాంసుడు "సిక్కుల చరిత్రము" అనే గ్రంథమును వ్రాసియున్నాడు. అతడు స్వయముగా చూచిన ఒక అద్భుతవిశేషమును ఆ గ్రంథంలో యీ క్రిందివిధంగా వర్ణించెను.

1837 సం॥లో లాహోరుకు ఒక ఫకీరు వచ్చెను. తన్నొక పెట్టెలోపెట్టి తాళము వేసినయెడల ఎన్ని దినములైనను అన్నపానములు అవసరం లేకుండా జీవింపగలనని చెప్పెను.

అప్పటి పంజాబులో సిక్కు ప్రభువైన రణజిత్తుసింగు అతనిని పరీక్షింపగోరెను : ఆ ఫకీరును ఒక కొయ్యపెట్టెలో పెట్టి, ఆ పెట్టెను నేలక్రింద ఒక సొరంగంలో పెట్టించి పెట్టెకు తాళము వేసిరి. నేల సొరంగము ఒక చిన్న యింటిలో ఉన్నది. ఆ ఇంటికి తాళము వేసిరి. ఇంటిప్రాకార ద్వారమును ఇటుకలతో అడుసుతో కట్టి మూసివేసిరి. గోడకు వెలుపల చుట్టును కాపలాభటులను రణజిత్తు సింగు నియమించెను. 40 దినములు యీరీతిగా కాపలా ఉంచిన పిమ్మట, రణజిత్ సింగున్నూ, ఆయన మనుమడును, చాలామంది సరదారులున్నూ, జనరల్ వెంటూమ్ గారున్నూ, కాప్టెన్ వేడేగారును, యీ గ్రంథకర్తయైన మెగ్రిగోరున్నూ హాజరై ఉండగా ఆ ఫకీరును ఆ పెట్టెలోనుంచి బయటకు తీసిరి. కొంతసేపటికి ఆఫకీరు మాట్లాడగలైను. అతడు యీ అద్భుత కార్యమును చేయగల్గినందుకు రణజిత్ సింగు స్వహస్తములతో ఒక బంగారుగొలుసును అతని మెడలో వేసెను. గౌరవార్థంగా ఫిరంగులను కాల్పించి ఉత్సవము చేసెను.

# దరిద్రదేవతలు

“చెప్పు! డబ్బేం చేశావో నిజం చెప్పు!” అంటూ రమేశాన్ని వాళ్ల నాన్నగారు వీపుమీద రెండు దెబ్బలు వేశారు పేక బెత్తంతో.

వాడు పెద్దగా ఏడుస్తూ “జేబుకి కన్నం ఉంది నాన్నా. డబ్బు కట్టిన పొట్లం ఎక్కడో పడిపోయింది. ఇంటి కొచ్చేవరకు నేను చూసుకోలేదు నాన్నా” అని వెక్కుతూ వెక్కుతూ చెప్పాడు.

శేఖరంగారిది చాలా బీదకుటుంబం.

శ్రీ ఓ. వి. విఠల్‌కుమార్

వారింట్లో సంపాదించేవాడు ఆయన ఒక్కడే కానీ తినే వారు మాత్రం చాలమంది ఆయన కలెక్టరాఫీసులో గుమస్తా. ఆ కొద్ది జీతంతోనే భార్యనీ, కొడుకునీ, యిద్దరు కూతుళ్లనీ పోషించాలి.



ఆయనకున్న ఆస్తి తండ్రిగారు మిగిల్చిపోయిన ఆ మూడు ఎకరముల భూమి మాత్రమే. అందులో ఒక ఎకరం ఉద్యోగం సంపాదించడానికే హారించుకుపోయింది. తక్కిన రెండు ఎకరాలు పెద్దకూతురు పెండ్లికి కొంత కట్నం క్రిందా, కొంత తతిమ్మా ఖర్చుల క్రిందా అయిపోయింది.

ఇక ఆయనకు మిగిలినది నెలంతా కష్టపడి పనిచేస్తే ఆఖరున వచ్చే ఆ జీతంరాళ్ళే. ఈ కరువు రోజులలో ఆ జీతంతోనే ఇంత మందిని పోషించాలంటే ఎలా వీలవుతుంది? పైగా కూతురు అత్తగారు కట్నం ఇంకా పూర్తిగా చేరలేదని వారానికో ఉత్తరం వ్రాస్తూంటారు. అదెలా తీర్చటం? ఇలా కష్టంగా కాలం గడుపుతున్న రోజులలో కరువులో అధికమాసం అన్నట్లు ఆయనకు ఇంకొక మగపిల్లవాడు కలిగాడు.

వాడికి పాలడబ్బాలు, మందులు తేవడానికి డబ్బెక్కడుంటుంది? ప్రతి నెలా ఆయన కొచ్చే జీతం పదవ తారీఖువరకే సరిపోతుంది. మళ్ళీ సంచీ చేత పట్టుకుని ఊరు మీద బయల్దేరవలసివచ్చేది అప్పు కోసం.

శేఖరం గారింటికీ ఆఫీసుకీ

నాలుగుమైళ్ళ దూరమున్నా ఆయన రోజూ రెండుసార్లు నడిచే వెళుతూ వస్తూండేవారు. అలా వున్నప్పుడు కుర్రవాడేం బాగా వుంటాడు? వాడి ఆరోగ్యం పూర్తిగా చెడిపోయింది. డాక్టరుకు చూపిస్తే మంచి ఖరీదైన మందులు వ్రాసిచ్చి కొనమన్నాడు. ఆ మందులు యిస్తేనే కాని కుర్రవాడు బ్రతకడనికూడా ఖచ్చితంగా చెప్పేశాడు. అయినా ఆ మందులు కొనడానికి కూడా డబ్బు లేదు.

శేఖరంగారు బయట కాలు పెడ్తే అప్పులవాళ్ల బాధ. ఆఫీసు నుండి ఇంటికి రాగానే భార్య మందు తెచ్చారా అంటూ దీనంగా అడిగేది. వీటన్నిటితో శేఖరంగారికి పిచ్చెత్తినట్లయ్యేది. సరైన మందులు పడక కుర్రవాడికి కొన్నాళ్ళకి జబ్బు ఎక్కువైంది. శేఖరంగారు మాత్ర మేమి చేస్తారు?

ఇక ఇలా అశ్రద్ధ చేస్తే లాభం లేదని యికనైనా మంచి మందులు, ఇంజక్షన్లు ఇవ్వకపోతే కుర్రాడు బ్రతకడని నిర్ధారణ చేసుకున్నారు శేఖరంగారు. అందుచే భార్యకున్న చిన్న చిన్న బంగారు వస్తువులు అన్నీ తీసుకొని అమ్మి, ఆ డబ్బుతో మందులు కొందామని కొడుకు రమేశంతో సహా మార్వాడి దగ్గరకు బయల్దేరి వెళ్లారు. మార్వాడీ నెలాగో కాళ్లు గడ్డం పట్టుకుని ఒప్పించి ఒక వంద రూపాయలకు వస్తువులన్నీ అమ్మివేశారు.

శేఖరంగారు ఆ సొమ్మును పొట్లం కట్టి కొడుకు రమేశం చేతికి యిచ్చి యింటికి పంపిస్తూ "ఒరే! రమేశం! డబ్బు జాగ్రత్తగా తీసుకువెళ్లి అమ్మకు యియ్యి. ఆఫీసులో సెలవు పుచ్చుకొని నేనిప్పుడే వచ్చేస్తాను" అని రమేశాన్ని పంపించేశారు. వాడు మెల్లగా నడుచుకొంటూ యింటికి పోతున్నాడు.

తల్లీ, తండ్రీ పడే బాధలు వాడికేం తెలుసు? వాడి మనసుకు అనేకమైన ఆలోచనలు తట్టున్నాయి. "తమ్ముడెప్పుడూ ఏడుస్తూ బక్కచిక్కి వుంటాడు. రోజూ త్రోపుడు బండిలో పార్కుకు వచ్చే సావిత్రి తమ్ముడు చూడచక్కగా బొద్దుగా వుంటాడు. ఎప్పుడూ ఏడువనే ఏడువకుండా ఆడుకుంటూ వుంటాడు. మరి వీడో - పాలైనా త్రాగడు. ఎప్పుడూ గోల చేస్తాడు...అమ్మా, నాన్నా యెందుకో ఎప్పుడూ విచారంగా వుంటారు. నాకు స్కూలుకి జీతం కట్టలేదు. పుస్తకాలు కొనలేదు. మేష్టారు బడికి రావద్దన్నాడు. ఈ మాట నాన్నగారితో చెపితే 'నా దగ్గర డబ్బు లేదు. బడి మానేయి' అన్నారు...మరి ప్లీడరు సూర్యనారాయణగా రబ్బాయి,— సత్యనారాయణ - ఎప్పుడూ కొత్త బట్టలూ, జోళ్లూ వేసుకుంటాడు. మేష్టారు చెప్పగానే పుస్తకాలు కొనేస్తాడు. అయినా ఒక్కప్రశ్నకు కూడా నాలాగా జవాబు చెప్పనే లేడు. వాడు చదువకపోయినా సరే, రోజూ వాళ్ల నాన్న కొనుక్కునేందుకు వాడికి డబ్బులిస్తూనే ఉంటాడు.

"...మరి నాకో? ఎప్పుడూ చినిగిన బట్టలే. జోళ్లు అసలు లేనే లేవు. పుస్తకాలు కొనమంటే నా దగ్గర డబ్బు లేదురా అంటారు నాన్న. నేనెంత బాగా చదివినా దమ్మిడీ అయినా యివ్వరు, కొనుక్కోడానికి. ఆ సత్తిగాడెప్పుడూ నాతో మాట్లాడనే మాట్లాడడు. వాడికి నాకూ తేడా ఏమిటో? వాళ్ల నాన్నలా మా నాన్న మంచివాడు కాదేమో?" అనుకుంటూ యిల్లు చేరుకున్నాడు.

"ఏమిరా ఇంత ఆలస్యంగా వచ్చావు? మీ నాన్నా రేరీ? మార్వాడీ ఏమన్నాడురా?" అంటూ ప్రశ్నలవర్షం కురిపించింది వాళ్ల అమ్మ.

"నాన్న ఆఫీసుకు వెళ్లి సెలవు తీసుకుని ఇప్పుడే వస్తానన్నారమ్మా. మార్వాడి వంద రూపాయిలిస్తే పొట్లం కట్టి నీకు ఇమ్మని నా చేతికి యిచ్చారు. ఇదిగో!" అంటూ లాగూ జేబులో చేయి పెట్టాడు. కాని ఆ చేతికి ఏమీ తగులలేదు.

జేబుకన్నంలోనికి మాత్రం చేతివేళ్లు దూరాయి. వెంటనే రెండో జేబులో చెయ్యి పెట్టి వెతికాడు. అందులోనూ ఏమీ లేదు. గాబరాగా వెతికిన జేబులే మళ్ళీ మళ్ళీ వెతకడం మొదలుపెట్టేడు. లాగూ విప్పి దులిపాడు కూడా. కాని డబ్బు పొట్లం మాత్రం కనిపించ లేదు.

"ఏమిటిరా వెతుకుతున్నావు? ఖర్మంచాలక డబ్బు గాని పారేశావేమిటి?"అంటూ దగ్గరసా వచ్చింది వాళ్ల అమ్మ.

"ఔనే అమ్మా! ఎంత వెదికినా కనుపించడం లేదు. జేబుకు కన్నం కూడా ఉంది. ఎక్కడో పడిపోయిందే" అంటూ ఏడుపు మొహం పెట్టాడు రమేశం. "ఓరి ముదనష్టపు వెధవా! ఎంత పని చేశావురా? మీ నాన్నగారు ఎంత కష్టపడ్డా



# దురదృష్టవంతులు



శనిగ్రహంలా నీవు ఫలితం దక్కనీయలేదుకదరా!" అంటూ చూరులోనున్న బెత్తం తీసుకొని ఆవేశంతో ఒళ్లు తెలియక చేతి కొచ్చినన్ని దెబ్బలు కొట్టడం మొదలు పెట్టింది రమేశాన్ని వాళ్ల అమ్మ.

ఇంతలో శేఖరంగారు గుమ్మంలో కాలుపెడుతూనే "ఏమిటే! వాణ్ణలా ఎందు కొట్టుతున్నావు?" అని అడిగారు.

"మీ రిచ్చి పంపిన డబ్బు ఎక్కడో పారేశాడు—దరిద్రపు వెధవ" అంటూ మరి రెండేసింది వాళ్ల అమ్మ. వాడు ఝల్లెగిరిపోయే టట్టు ఏడుస్తున్నాడు.

ఆ మాట వినగానే అమాంతంగా కుర్చీలో కూలబడిపోయారు శేఖరంగారు. ఆయనకు ఒళ్లు తెలియని కోపము వచ్చేసింది. ఆ కోపంతో భార్య చేతిలోని బెత్తం తీసుకొని రమేశం ఒంట్లో ఒక్క ఎముక లేకుండా చితకతన్నారు.

"చెప్పు! డబ్బేం చేశావో నిజంచెప్పు" అని రమేశాన్ని వాళ్ల నాన్నగారు వీపుమీద రెండు దెబ్బలు వేశారు బెత్తంతో.



వాడు పెద్దగా ఏడుస్తూ "జేబుకి కన్నం వుంది నాన్నా. డబ్బుకట్టిన పొట్లం ఎక్కడో పడిపోయింది. ఇంటి కొచ్చేవరకు నేను చూసుకోలేదు నాన్నా" అని వెక్కుతూ చెప్పాడు.

"పదరా! వెధవాపద! ఎక్కడ పారేశావో వెతుకుపో" అంటూ రమేశాన్ని జుట్టు పట్టుకొని బయటకు తోసేశారు శేఖరంగారు.

అప్పటికే చిన్న కుర్రవాడికి ఒంటిమీద తెలివి లేదు. వాడి దగ్గర కూర్చుని వాళ్లఅమ్మ విచారంగా కళ్లనీళ్లు కారుస్తోంది.

ఆదృశ్యం శేఖరంగారు చూచి రమేశంగాడి మూలంగానే కదా వాడి మందులకని తెచ్చిన డబ్బంతా పోయింది అనుకుని వాడ్ని మరి రెండు తన్నులు తన్ని డబ్బు వెతకడానికి తనూ బయల్దేరారు. రెండు మూడు సార్లు ఇటూ అటూ తిరిగి రోడ్డంతా వెతికేరు. మార్వాడి కొట్టు దగ్గరకూడా వెతికేరు. కాని ఎక్కడా డబ్బు పొట్లం కనుపించలేదు.

శేఖరం గారికి డబ్బు కనిపించక పోయేసరికి ఇంకా కోపం ఎక్కువై పిచ్చెత్తినట్లయింది. అది ఆపుకోలేక చేతికొద్దీ రమేశాన్ని మళ్లీ కొట్టారు. వాడు ఆదెబ్బకి "అమ్మా!" అంటూ రోడ్డుకు అడ్డంగా పరుగెత్తేడు. ఇంతలో ఒక కారువచ్చి రమేశాన్ని ఒక్క గుద్దుగుద్ది ఆగిపోయింది.

బ్రేక్ వెయ్యడానికి కూడా టైము లేకుండా దారి ప్రక్క నున్న కుర్రవాడు కారు కడ్డంగా వస్తె డ్రైవర్ మాత్రమేం చేస్తాడు? ఈ దృశ్యం చూసేసరికి శేఖరం గారికి నిజంగానే పిచ్చెక్కింది. "ఆ! ఆ! రమేశం! రమేశం!" అంటూ ఆయన వాడిమీద పడి పోయారు. ఇంతలోనే ఏదో మెరుపు మెరసినట్లుగా ఆయనకొక పొట్లాం కనుపించింది కొంచం దూరంలో. ఆయనది విప్పి చూశారు. రమేశం పారేసిన డబ్బు పొట్లమే అది! రమేశం వైపు చూశారు.

వాడి పిచ్చికంత ప్రాణాలు అప్పుడే ఎగిరిపోయాయి "ఈ డబ్బు నుంచే కదా, నీప్రాణాలు నా చేతులారా తీశాను రమేశం!" అంటూ శేఖరంగారు తల నేలకేసి కొట్టుకున్నారు. తర్వాత రమేశం శవాన్ని చేతులమీద వేసుకుని ఇంటికి మోసుకొచ్చారు.

గుమ్మం ఎక్కుతూండగానే ఇంట్లో ఏడుపు వినబడింది. ఇంట్లోకి వెళ్లి చూస్తే భార్య పిల్లలు చిన్న కుర్రవాడిమీద పడి ఏడుస్తున్నారు. అది చూచి శేఖరం గారికి తల తిరిగి పోయింది. ఆయన రమేశం శవంతో సహా నేలమీద దభీమని పడిపోయారు. ఆ శబ్దం విని ఆమె చిన్న కుర్రవాడి శవాన్ని వదిలి రమేశం శవంమీద పడిపోయింది.

ఇక ఆయింట్లో ఏడుపులకు పెడబొబ్బలకు తక్కువా? బాకీల కోసం వచ్చిన వాళ్లంతా అప్పటికి మాత్రం వాళ్లను డబ్బు అడగకుండా వూరుకొన్నారు. ★




(గతసంచిక తరువాయి)

జర్మనీలోనే హెర్ క్రాల్ అనే మరో కాయన గుర్రాలను సాకుతూ వుండేవాడు. ఏ గుర్రం చేతనైనా లెక్కలు చేయించటం, ప్రశ్నలకు సమాధానాలు చెప్పించటం తెలికేనని ఆయనకు ఒక నిశ్చితాభిప్రాయం వుండేది. తన దగ్గర 'మహమ్మద్' అనే మంచి అరేబియా జాతిగుర్రం ఒకటివుంటే, దాని విషయంలో యీయన ప్రత్యేకం శ్రద్ధ తీసుకొని దానికి లెక్కలు నేర్పటం మొదలు పెట్టాడు.

ఒక్కవారం రోజులు గడిచేసరికి ఆ గుర్రం 4, 6 యిల్లాంటి అంకెలను గుర్తు పట్టగలిగింది. బ్లాక్ బోర్డు వద్దకు వెళ్ళి ఏ అంకెను చూపించమంటే ఆ అంకెను తన ముట్టెతో తాకటం నేర్చుకొన్నది. ఇంకొక వారం గడిచేసరికి 5, 3 కలిపితే 8 అవుతుందని తెలుసుకొంది. మరొక వారం గడిచేసరికి 6ని 3పెట్టి హెచ్చిస్తే 18 వస్తుందని చెప్ప గలిగింది. ఇలా కొన్ని వారాలు గడిచేసరికి ఆల్జిబ్రా లెక్కలు కూడా చేసెయ్య గలిగింది.

ఈ 'మహమ్మద్' అంత పెద్ద పెద్ద లెక్కలకు సమాధానాలు సునాయాసంగా చెప్పెయ్యటం వరకు బాగానేవుంది. కాని, యిందులోనూ ఒక కిటుకు వున్నదని తరువాత బయట పడింది. ఏ లెక్క అయినా, ఆ లెక్కకు సరైన సమాధానం ఏదో బాగా తెలిసిన మనిషి ఎవరైనా ప్రక్కన వుంటేనేగాని, యీ 'మేధావి' ఎంత చిన్న లెక్కకైనా సమాధానం చెప్పలేక పోయేదని కొన్ని పరిశోధనల వల్ల తెలిపోయింది.

అమెరికాలోనూ యిలాంటి 'మేధావి' గుర్రాలు వుండక పోలేదు. 'బ్లాక్ బేర్' అనే పేరుగల గుర్రం ఒకటి 'టైం' ఎంత అయిందో చెప్పటం, కూడికలు, తీసివేతలు హెచ్చింపులు చెయ్యటమే కాక అందమైన అంగనలు ప్రక్కన నిలబడితే వారి కపోలాలను చుంబించేటంత గడుసుదనం కూడా అలవరుచు కొన్నది. ఆ గుర్రాన్ని చూసి అమెరికన్ శాస్త్రవేత్తలు తెగ మురిసిపోయేవారు. మరొక గుర్రం కూడా యిలాటి పనులన్నీ చేయటమే కాక, చైనీస్ భాషలో సంభాషించటం, అమెరికన్లకు అర్థమయ్యేలా ఛలోక్తులు విసరటం అన్నీ చేసేదట. దీనిపేరు 'లేడీ.' ఈ గుర్రాన్ని గురించి కూడా శాస్త్ర వేత్తలు చాలా పరిశోధనలు చేసి, దీనికి 'టెలిపతీ' శక్తి వున్నదని తేల్చారు. 'టెలిపతీ' అంటే రెండో మనిషి మనస్సులో వుండే భావాన్ని సాధారణమైన సాధనలు ఏవీ వుపయోగించకుండా తెలుసుకో గలగటం అన్నమాట. ఈ శక్తిని ఒక విధంగా 'మెదడు రేడియో' శక్తి అనవచ్చు.

తెలివి తేటలకి ప్రపంచ మంతా పేరుపొందిన గుర్రం 'ట్రిగర్.' ఇది అమెరికాలో తయారయ్యే అనేక స్టంటు సినిమాలలో 'తార.' దీన్ని యజమాని రాయ్ రోజర్స్ సామాన్యంగా ఆ స్టంటు సినిమాలలో హీరోగా వేస్తుంటాడు. [illegible] నాయకుడు దొంగల ముఠాల

## ★ జంతుకోటిలో మానవ లక్షణాలు ★

చేతుల్లో చిక్కబోయే సమయంలో యీ 'ట్రిగర్', దానికంతా అర్థమైనట్లు, ఆదొంగల నాయకుణ్ణి తరిమివెయ్యటమో, తలుపుకు వేసిన తాళాలు తెరవటమో—యిలాంటి గొప్ప గొప్ప పనులు చేస్తున్నట్లు ఆ సినిమాలలో చూపిస్తుంటారు. ఇవిచూసినవారంతా ఆ 'ట్రిగర్‌ను' మించిన తెలివి తేటలుగల గుర్రం మరెక్కడా వుండబోదని నమ్ముతారు. కానీ నిజానికి ఆగుర్రం చేసిన ప్రతి చేష్టా కూడా అంతకు ముందు ఎందరో మనుష్యులు చేరి తలలు బద్దలు కొట్టుకొని దీనికి నేర్పి పెట్టారు.

ఇంతవరకు మనం చెప్పుకొంటున్న కథలమాట అటుంచి, నిజానికి గుర్రాలనే జంతువులకు స్వతస్సిద్ధంగా ఎంత తెలివి తేటలు వుంటాయనే విషయాన్ని పరిశీలిద్దాం. ఈ వుద్దేశంతో లోగడ కొన్ని పరీక్షలు చేసి చూశారు.

అర్ధ వర్తులాకారంగా వున్న ఒక గోడలో నాలుగు తలుపులు అమర్చి కట్టారు. ఆనాలుగు తలుపులలో ఒక్క తలుపుతప్ప మిగిలిన మూటినీ లోపల నుంచీ తాళాలు వేసి పెట్టారు. తాళంలేని తలుపు ఏదో కనుక్కొని, ఆతలుపు తెరిచి అవతలకు ఏజంతువు రాగలిగితే దానికి యిష్టమైన తిండి అక్కడ దొరికే పద్ధతి ఏర్పాటుచేసి, యీ నాలుగు తలుపుల ముందు అనేక రకాల జంతువులను వదిలిపెట్టి చూస్తే, అన్నింటిలోకి అయోమయంలోపడ్డజంతువు గుర్రమేనట!

ఈ పరీక్షా పద్ధతిలో ఒక చిన్న మార్పు ఒకటి చేశారు. మొట్టమొదటిసారి ఒకటో నెంబరు తలుపు తాళం లేకుండా వున్నదనుకోండి. రెండో పరీక్షలో యీ తలుపు తప్పకుండా తాళం వేసి వుంచేవారు. పది పదిహేను సార్లు అన్ని తలుపులూ తెరవటానికి ప్రయత్నం చేశాక, నిజంగా తెలివి తేటలున్న జంతువుకైతే, యీ సూత్రం బోధ పడుతుంది. ఈ సూత్రం ఒకసారి బోధ పడిందీ అంటే ఆ తరువాత అది మిగిలిన మూడు తలుపుల్లో ఏదానికి తాళం లేకుండా వున్నదో వెతుకుతుందే కానీ, అన్ని తలుపులనూ తట్టి చూడదు. ఈ సూత్రాన్ని కోతులు ముందుగా గ్రహించాయట. గుర్రాలు మాత్రం ఎంతకీ యీ విషయాన్ని గమనంలో పెట్టుకోనే లేక పోయాయట.

మరొక రకమైన పరీక్షలో జంతువులకు ఎదురుగా మూడు పెద్దపెద్ద పెట్టెలు నిలబెట్టి అందులో ఒక దాంట్లో మేత పడేశారట. ఏ పెట్టలో అయితే మేత పడేసి పెట్టారో, ఆపెట్టెకు ప్రక్కగా గుర్తు పెట్టుకోవటానికి వీలుగా ఒక బక్కెట్టుపెట్టి వుంచారట. ఈపద్ధతిని అనేకసార్లు ప్రయోగించి, ఎప్పటికైనా యీ జంతువులు మేతవున్న పెట్టె ఏదో కనుక్కోవటానికి యీ బక్కెట్టు ప్రక్కగా వుండటమే గుర్తు అన్న విషయాన్ని గ్రహించగలవేమో అని చూస్తే అన్నింటిలోకీ గుర్రాలకే ఆలస్యంగా ఆవిషయం బోధ పడిందట.

పైన వుదహరించిన గుర్రాలన్నీ మచ్చిక అయిన గుర్రాలు. అలా కాకుండా అడవిలో స్వేచ్ఛగా బ్రదికే గుర్రం కూడా యిలాగే వుంటుందా అన్న సందేహం రావచ్చు. కుక్కా, పిల్లీ వున్నాయంటే, అవి యితర ప్రాణులను వేటాడే జంతువులు. గుర్రం అలా కాదు. ఇది యితర జంతువులచేత వేటాడబడే జంతువు. ఆ కారణంచేత పిల్లీ, కుక్కా వీటితో పోలిస్తే, గుర్రంతత్వంలో ఎంతోవ్యత్యాసం కనుపిస్తుంది. వేటాడే జంతువు కాబట్టే, ఏక్షణాన ఏ ప్రక్కనుంచీ ఏ జంతువు వచ్చి మీదపడుతుందో చూడటానికి వీలుగా వుండటం కోసమే గుర్రానికి కళ్లు తలకి రెండు ప్రక్కలా వుంటాయి. జింకకు కూడా యీ కారణంచేతనే కళ్లు ప్రక్కకు వుంటాయి. కుక్కకీ, పిల్లికి ముక్కుకి రెండు ప్రక్కలా వుంటాయి. ఇవి ఎదురుగుండావుండే వాటిని మాత్రమే చూడగలవు. రెండు కళ్ళూ ప్రక్కప్రక్కగా వున్నందువల్ల వాటికి ప్రతివస్తువూ రెండు బింబాలుగా ఏర్పడి, ఆ రెండు బింబాలు కంటి వెనుక వుండే తెరమీద ఏకమై, వస్తువు ప్రస్ఫుటంగా కనుపిస్తుంది. గుర్రానికి అలా కాదు. అది ఏ వస్తువును చూడాలన్నా ఏదో ఒక్క కంటితోనే చూడాలి.

మరొక విషయం కూడా వుంది. కనీసం ఆ జింకకు వున్నట్లు కొమ్ములైనా వుంటే గుర్రానికి కొంతముటుకు ఆపద వచ్చినా కాచుకోగల నన్న ధైర్యం వుండేదేమో!- అవి కూడా లేకపోయేసరికి ఏ కాస్త ప్రమాదం వస్తున్నట్లు తోచినా, యీ గుర్రానికి పలాయనం చిత్త

ఆ సినిమాలో ఏమి ఆకర్షణ వుందో ఏమో కానీ, పడుచు కుర్రాళ్లు అందరూ ఎగబడి చూస్తున్నారు. ఈ విషయం గమనించిన అరవై ఏళ్ళ ముసలాయన, తానూ ఆ సినిమాలో వున్న విశేష మేమిటో చూద్దామన్న తలంపుతో ఆ రోజు హాలుకి వెళ్ళి 'క్యూ'లో చిట్టచివర నిలబడబోతున్నాడు.

'క్యూ'లో నిలుచున్న కుర్రాడొకడు మిగిలినవాళ్లందరినీ వుద్దేశించి, "పాపం, ఆ ముసలాయనను ముందు నుల్చోనీయండి" అన్నాడు.

ఆ ముసలాయన ఎవరోనని క్యూలో వున్న అందరూ వెనక్కి తిరిగిచూశారు. వాళ్లందరితోపాటు యీ అరవై ఏళ్ల ముసలాయన కూడా వెనక్కిచూశాడు.

గించటంకంటే వేరే మార్గం లేదు. తత్ఫలితంగా యిది వుత్త పిరికి జంతువుక్రింద తయారైంది. అంత పిరికిగుండె కాబట్టే, కార్లు వచ్చిన కొత్తరోజుల్లో రోజుకి ఎన్నో గుర్రపు బగ్గీలు బోల్తాకొట్టేవి.

అందుకనే సామాన్యంగా సర్కసుల్లో గుర్రాలకు 'ఫీట్స్' నేర్పేటప్పుడు పైవాళ్లని ఎవరినీ రానీయరు. క్రొత్త వ్యక్తి ఎవరువచ్చి, ఏమాదిరి శబ్దం చేసినా, 'ఫీట్స్' చేస్తూ చేస్తూవున్న గుర్రం అదుపు తప్పిపోతుంది.

పశువులశాలకు నిప్పు అంటుకొన్నప్పుడు ఆవులు, గేదెలు వీటి మెడకట్టుతాళ్లు ఎవరైనావూడదీస్తే, అవి చక్కగా స్కూలుపిల్లలు డ్రిల్లుకు పోయినంత సజావుగా బయటికి నడిచిపోతాయి. గుర్రాలు మాత్రం అలా కాదు. వీటికి వున్న కంగారుకు మితి వుండదు. కట్టుతాళ్లు విప్పినా కూడా యివి ఒకదాన్ని ఒకటి తోసుకోవటంలో తోకలు అంటించుకు తన్నుకులాడుతాయి. ఒకసారి యిలాగే ముప్ఫయి గుర్రాలు కట్టేసివున్న పాకకు నిప్పు అంటుకోగానే, అక్కడ వున్నవాళ్లు ఎవరో నానా తంటాలుపడి వాటి నన్నిటినీ విప్పేసి కొంతదూరంలో వున్న ఖాళీస్థలంలో వదిలిపెట్టారట. కానీ, వాటికి మొదట ఆ మంటలు చూసినప్పటి బెదురు ఎంతకీ పోక, ఒకదాన్ని ఒకటి తన్నుకొంటూ అన్నీ కలిసి కట్టగట్టుకుపోయి మళ్ళీ ఆ నిప్పులో పడి చచ్చాయట.

తిండి విషయంలోకూడా గుర్రం చాలా అజాగ్రత్తగా వుంటుంది. దీనికంటే గాడిద నయం. ఎంత కావాలో అంతే తిని వూరుకొంటుంది. గుర్రం అల్లా కాదు. పగలంతా పనిచేసి వచ్చాక మితం తెలియకుండా మేసి, పొట్ట పట్టకుండా నీళ్లు తాగేసి ఆ తరువాత భుక్తాయాసంతో నానా యాతన పడుతూ వుంటుంది.

ఇవన్నీ వ్రాస్తున్నందుకు, కొందరికి కోపం రావచ్చు. మన అందరికీ కూడా నిజం తెలియనంతవరకు గుర్రం అంత గాంభీర్యం, ఔదార్యం, ప్రాగల్భ్యం వున్న జంతువు మరేదీ లేదనే నమ్మకం వుంటుంది. కానీ - అది నిజంకాదని తెలిశాక కూడా, నిజం కానిని నిజం అనుకొని పొంగిపోమ్మంటే ఎల్లాగు?

(ఇంకా వుంది)

గుమాస్తాలవర్గానికిచెందిన ఆ దరిద్రుడికి కవలలు కూడాను! సంక్రాంతి పండుగకు అప్పుచేసి అందరికీ కొత్త బట్టలు కుట్టించాడు.

ఆ కవల పిల్లలకు కోట్లు కుట్టటానికి దర్జీకి యిచ్చి, వాడు రమ్మన్నరోజుకి పిల్లలని యిద్దరినీ వాడి కొట్టుకు తీసుకుపోయాడు.

కొత్తగా కుట్టిన కోటును దర్జీవాడు పైకి తీసి ఒకకుర్రాడికి తొడిగి ఎదురుగుండా వున్న నిలువటద్దం ముందు నిల్చోపెట్టాడు. రెండోకుర్రాడికి కూడా కోటు తొడగబోతుండగా, ఆ తండ్రి అడ్డం వచ్చి "అక్కర లేదు; వాళ్ళిద్దరూ కవలలేలే!" అన్నాడు.



నాగూర్ సినీ ప్రొడక్షన్సు వారి 'అమరకవి' (తెలుగు) లో కామవల్లిగా పి. కె. సరస్వతి.

# సింహావలోకనం

**1931** లో 'ప్రహ్లాద' వెలువడినప్పటి నుంచీ ఇప్పటివరకూ 200 పైగా తెలుగు చిత్రాలు వెలువడ్డాయి. వీటిలో పదోవంతు పైగా అంటే పాతికచిత్రాలు 1952 లోనే విడుదలయ్యాయి. అప్పటికీ ఇప్పటికీ చూసుకుంటే, నిర్మాణసంస్థలు, స్టూడియోలు, చిత్రాల ఉత్పత్తి, సినిమా మందిరాలు ఎంతో అభివృద్ధి అయినట్లు స్పష్టంగా కనిపిస్తుంది. దర్శకులు, నటీనటులు, టెక్నీషియన్లు, వీరి సంఖ్యకూడా విరివిగా అభివృద్ధి పొందింది. కేవలం సంఖ్యల్లోనే కాకుండా కళాదృష్ట్యా కూడా మన చిత్రాలు అప్పటికంటె ఇప్పుడు చాలదూరం పురోగమించాయన డంలో సందేహంలేదు.

తెలుగులో చిత్రనిర్మాణం ప్రారంభమయ్యే నాటికే పాశ్చాత్యదేశాల్లో సినిమా కళ అత్యుచ్ఛదశ అందుకునివున్నది. అప్పటికే సైలెంటుచిత్రాల యుగం అంతమై టాకీచిత్రాలు స్థిరపడిపోయాయి. మేధావులైన కళాకారులనేకులు సినిమా రంగంలో దిగి సినిమాచిత్రాలకు కళాగౌరవం ఆపాదించి పెట్టారు. సినిమా చరిత్రలో శాశ్వతస్థానం పొందగల అమెరికన్, రష్యన్, జర్మన్ చిత్రాలు అప్పటికే తయారయ్యాయి. సినిమాకళకు సంబంధించిన బోలెడంత 'థియరీ', 'ఈస్థటిక్స్' తయారైఉన్నది. ఆ స్థితిలో ప్రారంభమైనది మన చిత్రపరిశ్రమ. అయితే ఆ తొలిరోజుల్లో వెలువడిన మన చిత్రాలు చూస్తే సినిమాకు ఇంత పూర్వచరిత్ర ఉజ్వలమైనది ఉన్నట్లు తోచనేతోచదు. ప్రాథమికమైన టెక్నికల్ పనితనం తప్ప మన నిర్మాతలు, టెక్నీషియన్లు పాశ్చాత్యులనుండి ఇంకేమీ నేర్చుకోలేదు. కథలకోసం మన పురాణాలమీద ఆధారపడ్డారు. దర్శకత్వం, అభినయం, సంభాషణలు, ప్రొడక్షన్ మొదలైనవాటికోసం మన నాటకానుభవంమీద ఆధారపడ్డారు. ఆ రోజుల్లో వెలువడ్డ చిత్రాలు ఇప్పుడు చూస్తే ఎంత తక్కువ అభిరుచిగల ప్రేక్షకుడైనా నవ్వుకుంటాడు.

అయినా మన తొలిచిత్రాలను ప్రజాబాహుళ్యం విపరీతంగా అభిమానించింది. సాధారణంగా ఆ రోజుల్లో దెబ్బతిన్న చిత్రం అంటూ లేదంటే ఆశ్చర్యంలేదు. నాటకాలు ఉచ్ఛస్థితిలో ఉన్న రోజుల్లో సినిమాలు వచ్చి నాటకాలను పడగొట్టాయి. దీని కారణాలు అందరూ ఎరిగినదే. కథా కథనంలో నాటకాలకు లేని సౌలభ్యం సినిమాలకు ఉండటం; ప్రతిరోజూ మూడేసి ఆటల చొప్పున ఎన్ని రోజులైనా ఒకే చిత్రం ప్రదర్శించే సౌలభ్యం ఉండటం, నాటకంకంటె సినిమారేటు కారుచవక గావటం మొదలైన ఈ అన్ని కారణాలవల్ల నాటకరంగాన్ని సినిమాలు సులభంగా ఓడించాయి. నాటకాలకు ప్రజాదరం క్రమంగా తగ్గిపోయి, సినిమాలు ప్రజాజీవితంలో స్థిరపడిపోయాయి. నాటకాల స్థానంలో సినిమాలు వచ్చినందువల్ల సరిగ్గ నాటక లక్షణాలనే అవలంబిస్తూ అవి లే… లోటును ఇవి తీర్చడానికి ప్రయత్ని… చాయి.

సినిమా 'ఈస్థటిక్స్' ప్రకారం చూ… మన తొలిచిత్రాలు పాశ్చాత్య చిత్రాలతో పోలికకు రాకపోయినా, గడిచిన ఇర… య్యేళ్ల చరిత్ర చూస్తే ఒక క్రమపరిణామ… కనిపిస్తుంది. మొదటిది పౌరాణిక చిత్రా… శకం. ఈ శకంలో వెలువడిన చిత్రాలన్నీ దాదాపు నాటకాలే. అప్పటి స్త్రీ పురుష తారలందరూ నాటకరంగంనుంచి వచ్చి… వారే. పాటలు, పద్యాలు, సంభాషణలు అన్నీ నాటకీయంగానే ఉండేవి. సినిమ…



నాగూర్ సినీ ప్రొడక్షన్సు వారి 'అమరకవి' (తెలుగు చిత్రం)లో కథానాయిక టి. ఆర్ రాజకుమారి.



"వయారిభామ" సెట్స్‌మీద సులోచన, డైరెక్టరు పి. సుబ్బారావు, టెక్నీషియన్లు

## ★ సింహావలోకనం ★

లనిపించుకోనేందు కొకటే విశేషం: ట్రిక్ ఫొటోగ్రఫీ లేని పౌరాణిక చిత్రం ఉండేది కాదు. పాశ్చాత్యదేశాల్లోకూడా సినిమాలు ట్రిక్ ఫొటోగ్రఫీతోనే ప్రారంభమయ్యాయి. మనదేశంలోకూడా సినిమాలకు నాటకాల్లో లేని అదనపు ఆకర్షణ ఇచ్చింది ట్రిక్ ఫొటోగ్రఫీయే. పౌరాణిక చిత్రాల శకంలో "లాండ్‌మార్క్" అని చెప్పదగిన చిత్రం 1934 లో సి. పుల్లయ్యగారు తీసిన "లవకుశ". ఈ చిత్రం ఆతరవాత వెలువడిన అనేక పౌరాణిక చిత్రాలకు వరవడి పెట్టడమే కాక, సినిమా ప్రేక్షకుల సంఖ్యను విపరీతంగా పెంచింది.

పౌరాణిక చిత్రాలకు ఆనకట్ట కట్టింది 1938 లో వెలువడిన సాంఘిక చిత్రం "గృహలక్ష్మి". హెచ్. ఎమ్. రెడ్డిగారు తీసిన ఈ చిత్రం ఆతరువాత వెలువడిన అనేక సాంఘిక చిత్రాలకు వరవడి పెట్టింది. కొత్తరకం కథావస్తువును, సమకాలిక సాంఘిక జీవితానికి సంబంధించిన దాన్ని ఈ చిత్రం అందించింది. మద్యపాన వ్యసనం, వేశ్యాలోలత మొదలైనవాటి దుష్ఫలితాలను హృదయంగమంగా ఈ చిత్రం చూపించింది. సాంఘిక చిత్రానికి నిర్దుష్టమైన, స్పష్టమైన, ప్రయోజనవంతమైన కథ అవసరమని "గృహలక్ష్మి" నిరూపించింది. ఈ చిత్రం కథావస్తువును అనుకరిస్తూ మొన్న మొన్నటివరకూ ఎన్నో చిత్రాలు వెలువడ్డాయి. ఈ వరవడిలో స్వతంత్ర కథావస్తువులతో "మాలపిల్ల", "రైతుబిడ్డ", "మళ్ళీ పెళ్ళి", "వరవిక్రయం", "వందేమాతరం", "సుమంగళి" మొదలైన చిత్రాలెన్నో వెలువడ్డాయి. అందుచేత మన సినిమాచరిత్రలో "గృహలక్ష్మి" మరొక 'లాండ్‌మార్క్' అని చెప్పాలి.

1942 లో జెమినీవారు తీసిన "బాలనాగమ్మ" బాగా ఆర్జించింది. ఇప్పటి జానపదచిత్రాలకు ఒక నమూనా చూపింది. కాని 1947 లో శోభనాచల వారి "గొల్లభామ", ఆతరవాత ప్రతిభావారి "బాలరాజు" వెలువడినదాకా జానపదచిత్రాలపై నిర్మాతల దృష్టి ఎక్కువగా పడలేదు. 1947 నుంచి 1951 ఆఖరు వరకూ జానపదచిత్రాలశకం నడిచింది. అసంఖ్యాకంగా జానపద చిత్రాలు వెలువడ్డాయి. అంతవరకూ సాంఘిక గాథలూ, భక్తుల గాథలూ మాత్రమే తీస్తూవచ్చిన వాహినీవారు కూడా జానపదచిత్రం(గుణసుందరి)తీశారు. పౌరాణిక చిత్రాల్లో ట్రిక్ ఫొటోగ్రఫీ, పాటలు, పద్యాలు, తరవాత వచ్చిన సాంఘిక చిత్రాల్లో లక్ష్యశుద్ధిగల కథావస్తువులు ప్రాముఖ్యం వహించినట్టే జానపదచిత్రాల



నవ్యా స్టూడియోలో అజంతా వారి "వయారిభామ" సెట్స్: మధ్య చేతులు కట్టుకుని నుంచున్నది కెమేరామన్ అజయకౌర్. ఈప్రక్క డైరెక్టరు పి. సుబ్బారావు. ఆప్రక్క కొత్తనటి సులోచన.



చార్లీ చాప్లిన్ యిటీవల తయారుచేసిన 'లైమ్‌లైట్' అనే చిత్రంలో ఒక సన్నివేశం.

శకంలో తారలకు ప్రాముఖ్యం పెరిగింది. రూపు రేఖలతో ప్రేక్షకులలో గ్లామర్ కలిగించగల ప్రతినటీ, నటుడూ తారలయ్యారు. ప్లేబాక్ సిస్టంవల్ల తారలకు పాట చేతికావలసిన అవసరం కూడా పోయింది. కాని చిత్రాల్లో సంగీతానికి ప్రాముఖ్యం హెచ్చింది. కథావస్తువు అతుకులు బొతుకులుగా వున్నా ప్రముఖ తారలూ, సంగీతం, సెట్టింగులూ, నృత్యాలూ ఉంటే చిత్రం విజయవంతం అవుతుందనే అభిప్రాయం ప్రబలింది. కథావస్తువుకు ప్రాముఖ్యం తగ్గటంతో టెక్నిక్‌కి ప్రాముఖ్యం హెచ్చింది. పాటలూ, తారలూ, సెట్టింగులూ, టెక్నికల్ ప్రావీణ్యం గల "పాతాళభైరవి" కథ గొప్పది కాకపోయినా ఆర్థికవిజయం సంపాదించింది. పైన చెప్పిన ఈ లక్షణాలన్నిటి మూలంగా చిత్రనిర్మాణవ్యయం చాలరెట్లు పెరిగింది.

1952 లో పద్దెనిమిది దాకా సాంఘిక చిత్రాలు విడుదల అయినాయి. 1951 లో ఆరు మాత్రమే సాంఘిక చిత్రాలు, మిగతావి జానపద చిత్రాలు. 1952 లో విడుదలయిన జానపద చిత్రాలలో "ధర్మదేవత" మాత్రమే కొంత గడించిందని వినికిడి. మిగతావి బాగా దెబ్బతిన్నాయి. ఇప్పుడు నిర్మాణంలో ఉండి ఈ ఏడాది విడుదల కానున్న వాటిలో కూడా సాంఘికచిత్రాలే ఎక్కువ. ఇంకా విడుదల కావలసిన జానపదచిత్రాలు కొన్ని ఉన్నప్పటికీ ఈ వ్యాస రచయిత అంచనాప్రకారం జానపదాల శకం ఆఖరవుతున్నట్లే. "గృహలక్ష్మి" తరవాత పౌరాణిక చిత్రాలపై మోజు తగ్గుతూ వచ్చినప్పటికీ 1950 దాకా అడపాదడపా పౌరాణిక చిత్రాలు తయారవుతూనే వున్నాయి. అలాగే జానపద చిత్రాలు కూడా చెదురుగా మరి కొంత కాలంవరకూ వస్తే రావచ్చు. పౌరాణిక చిత్రాలు అంతరించటానికి కారణం పురాణ గాథలను అటు మార్చి, ఇటుమార్చి మొహం మొత్తేవరకూ వాడుకోవటమే. అలాగే కాశీమజిలీల ఫక్కీలో నడిచే జానపద గాథలు కూడా ప్రేక్షకులకు మొహం మొత్తేవరకూ రకరకాల మార్పులతో చిత్రీకరించబడ్డాయి. (తెలివిగల దర్శకులు, కళాభిరుచిగల నిర్మాతలు తలుచుకుంటే మంచి పౌరాణిక చిత్రాలు, జానపద చిత్రాలు వచ్చే అవకాశం ఎప్పటికీ ఉంటూనే వుంటుంది.)

ఇకపోతే సాంఘిక చిత్రాలు. పౌరాణిక జానపద శకాల మధ్యకాలంలో సాంఘిక చిత్రాలు వెలువడి ఆగిపోయినాయి. మళ్ళీ ఇప్పుడు ప్రారంభమయ్యాయి. సాంఘిక చిత్రాలు ఇలా రెండో జన్మ ఎత్తడానికి 1950 లో విజయావారు తీసిన "షావుకారు" ఒక కారణమనే పరిగణించాలి. అవిఘంగా అది మన సినిమా చరిత్రలో మరొక 'లాండ్ మార్క్' అవుతుంది. "షావుకారు" చిత్రం ఇతఃపూర్వ సాంఘిక చిత్రాలకంటె చాల అడుగులు ముందుకు వేసింది. పాత్రీకరణంలో, అభినయంలో, సంభాషణల్లో, వాతావరణంలో ముఖ్యంగా "క్రూడ్ సెంటిమెంటాలిటీ" లేకుండా మానసిక నిగ్రహం గలిగిన దర్శ

(51-వ పేజీ చూడండి)

# ప్రశ్నలు-సమాధానాలు

శ్రీ మారెళ్ళపూడి ఉప్పాకయ్య—
కాకినాడ.

మన హిందూదేశపు వైస్ ప్రెసిడెంటు "రాధాకృష్ణన్" ఆంధ్రులేనా ? అయినచో వారి పేరు చివరను "న్" అనుటకు కారణము ఏమి ? ఆంధ్రులైనయెడల "రాధాకృష్ణ" అని యుండవలెనుగదా ?

—రాధాకృష్ణన్‌గారు ఇంటిలో మాట్లాడేది తెలుగుభాష. వారి బంధువర్గంఅంతా తెలుగువారే. వారి యింటిపేరు సర్వేపల్లివారు. వారిపేరు రాధాకృష్ణగారు. కాని అరవవారు మొదలైన అన్యభాషీయులు వారిని "రాధాకృష్ణన్" అని పిలుచుచుండిరి. అందువల్ల యీపేరు ఎక్కువగా ప్రచారమై ప్రసిద్ధమై స్థిరమైనది.

*  *  *

శ్రీ దూర్వాసుల సుబ్బరాయశాస్త్రి—
కేశిగురుపాడు, తూ॥ గోదావరి.

కొన్ని వృక్షములు పగలు పరుండినట్లుగా భూమిమీద వ్రాలియుండును. తిరిగి అవి నిలువుగా నిలువబడియుండును కారణమేమి ?

—చెట్లకు నిద్రావస్థ అనేది ఉన్నదని ప్రఖ్యాత భారతీయ శాస్త్రవేత్తయగు సర్ జగదీశ చంద్రబోస్ గారు తమ యంత్రసాధనముద్వారా ఋజువు చేసియున్నారు. పరుండు చెట్లకు నిద్రావస్థ యుండుట వల్లనే అవి పరుండునని ఋజువు చేసిరి.

ఇల్లాలు పురిటివేదన, అల్లునిరాక, చెవిపోటు, కరువు, దరిద్రం, ఆబ్దికం, దొమ్మరాట యిత్యాది 14 కష్టాలు ఒక్కసారిగా సంప్రాప్తమయినవన్నారు. ఇది సత్యదూరము. మీ అభిప్రాయమేమి ?

—మీ అభిప్రాయమేమి? ఎన్ని కష్టాలు ఒక్కసారిగా రాగలవో మీ అభిప్రాయం తెలియజేయండి. ఎన్ని కష్టాలు ఒక్కసారిగా రాగలవో చెప్పడంకూడా కష్టమే.

*  *  *

శ్రీ యం. డి. శ్రీనివాసన్—మద్రాసు.

మనుష్యుడు ఆదిలో గొరిల్లా మృగముగానుండి మనిషిగా మారినాడు అనుదానిని మీరు యెట్లు ఋజువుచేయగలరు ?

—ఇంగ్లీషులో డార్విను అను శాస్త్రవేత్త సృష్టిపరిణామ వాదమును ఋజువు చేయుచు వ్రాసిన గ్రంథములను, హక్స్లె పండితుడు వ్రాసిన గ్రంథములను కూడా చదివి చూచిన మీ ప్రశ్నకు సమాధానము లభించగలదు.

*  *  *

శ్రీ పింగళి హనుమంతరావు—యీమని,
గుంటూరుజిల్లా.

వాయసములు క్రీడించుట చూచినవానికి కీడు మూడుననియు, అందుకు పరిహారముగా అట్టిది చూచినవాడు తాను మరణించినట్లుగా తనబంధువులకు తెలియజేసినయెడల, ఆ కీడుతప్పుననియు వాడుకకలదు. ఇది యధార్థమేనా ?

—వాయసమైథునం మనుష్యునికంటబడుట చాలా అరుదైన విషయమనిన్నీ, అందువల్ల యీ అసాధారణ దృశ్యం అనర్థదాయకం కావచ్చునని‌న్నీ జనులకొక భ్రమ ఏర్పడియుండవచ్చు. అందుకు పరిహారం ఆత్మమరణ వార్తాప్రచారం అనేది ఎవరో కల్పించారు. అందుమూలంగా బంధువులకు కల్పించేది విచారం. ఇది మూఢాచారం. దీనిని నమ్మడం గ్రహచారం. ఇట్టి అసత్యవార్తాప్రచారం ఒక అపచారం. వాయసంవల్ల కలిగిన సంశయాం కారణం లేని కంగారు-భూతము లేని భీతి.

*  *  *

శ్రీ బుచ్చిబాబు—రాజమండ్రి.

ఇనుపముక్కను అయస్కాంతపు ముక్కతో రుద్దినయెడల, యినుపముక్క అయస్కాంతం అవుతుందని కాలక్షేపంలో వ్రాసినారు. "ఉక్కు" ముక్కకే అట్టి స్వభావముకలదని మా లెక్చరరుగారు అన్నారు. మా లెక్చరరుగారు చెప్పినది నిజము కాదంటారా ?

—"ఇనుము" అనేది అనేక రకాలుగా ఉంటుంది. మెత్తని యినుము, గట్టియినుము. ఉక్కుకూడా ఇనుముయొక్క రూపాంతరమే. గట్టి యినుముకు ఉక్కుకు స్థిరమైన అయస్కాంత లక్షణం వస్తుంది. మెత్తని యినుముకు తాత్కాలిక అయస్కాంత లక్షణం వస్తుంది.

*  *  *

శ్రీ రేగిడి తులసీదాసు—విశాఖపట్నం.

చీటికీ మాటికీ కోపంవచ్చేవానికి ముక్కుపై కోపం ఉన్నదంటారు. అది యెట్లు ?

—మాట చెప్పుతూ చెప్పుతూ ఉండగానే శాంతంగా ఓపికపట్టి చివరవరకూ వినకుండానే మున్ముందుగా కోపం వచ్చినయెడల వానికి "మునుకోపం" ఎక్కువ అని తెనుగులో ఒక శబ్దం ప్రయోగింపబడుతూ ఉండేది. "మునుకోపం" అనగా "ముందుగానే కోపం" కలుగుట అని అర్థం. "మునుకోపం" అనేమాట కాలక్రమేణ "ముక్కోపం" అనే మాటగా ఉచ్చారణలోపంవల్ల మారింది. అటుపిమ్మట, యీ "ముక్కోపం" అనేమాటకు "ముక్కు + కోపం" అని కొందరు పదవిభాగం చేశారు. "ముక్కుమీద కోపం" కలిగిఉండటమే "ముక్కోపం" అని ఆమాటకు అర్థం కల్పించారు. కాని, శబ్దముయొక్క వ్యుత్పత్తిని బట్టి చూస్తే, ముక్కుకున్నూ, కోపమునకున్నూ సంబంధం లేదు.

*  *  *

శ్రీమతి అక్కలకమల—కొండపల్లి.

చాలామంది స్త్రీలు తమ భర్తలపేర్లు చెప్పరు. చెప్పితే ఏమైనా దోషమా? లేక సిగ్గా ?

—భర్తకంటె భార్య వయస్సులో చిన్నది. అన్నగారికంటె తమ్ముడు వయస్సులో చిన్నవాడు. అన్నగారిని అన్నగారి పేరుతో పిలుచుట తమ్మునకు మర్యాద కాదు. కాని తమ్ముణ్ని తమ్ముని పేరుతో అన్నగారు పిలువవచ్చును. ఇది మన సంఘంలో ఉన్న మర్యాద. కనుక భార్య చిన్నదైనందున భర్తను పేరు పెట్టిపిలుచుట మర్యాదకాదు. భర్తనుగురించి ఎవరితోనైనా ప్రస్తావించునప్పుడు "నా భర్తగారు" అనిగాని, "మా యింటి యజమాని" అనిగాని ప్రస్తావించడం మర్యాద. కాని, తన భర్తపేరును చెప్పకూడదనిగాని, చెప్పితే దోషమని

ఎక్కడా చెప్పబడలేదు. వ్యవహార సందర్భావసరములలో భర్తపేరును భార్య విధిగా చెప్పవచ్చు. భర్తనుగూర్చి తరచుగా భర్తపేరు చెప్పి భార్య ప్రస్తావిస్తూ ఉండినయెడల భార్యాభర్తలకు మధ్య ఉండే సునిశితమైన సరసభావానికి సామరస్యానికి లేతరంగు పోయి ముదురు ముతక రంగు వస్తుంది.

*   *   *

శ్రీ యస్. ఘటికాచలరావు—కడప.

సంగీతానికి, సాహిత్యానికి గల వ్యత్యాసం ఏమిటి ?

—సంగీతానికి స్వరం మాత్రమే కాకుండా సాహిత్యంకూడా ఉంటుంది. సాహిత్యానికి సంగీతం అంతర్భాగం కాదు. సాహిత్యంలో వచనం, ఉంటుంది. పద్యం ఉంటుంది. పద్యం అనేది లయబద్ధంగా ఉంటుంది. సంగీతంకూడా లయబద్ధంగా ఉంటుంది. శబ్దప్రధానమైనది, ధ్వనిప్రధానమైనది సాహిత్యం. స్వరప్రధానమైనది సంగీతం.

ఇటీవల శ్రీ రాజగోపాలాచారిగారు విద్యార్థులు సినిమా చూడగూడదని వక్కాణించారు. దీనిమీద మీ అభిప్రాయమేమి?

—శృంగారచేష్టలను అనగా స్త్రీపురుషులు ఆలింగనము చేసికొనడం, ముద్దులు పెట్టుకొనడం విద్యార్థులు అనగా బ్రహ్మచర్యాశ్రమంలో ఉన్నవాళ్లు చూడకూడదనే నియమం గురుకులాశ్రమశిక్షణ నియమం. ఆ గురుకులాశ్రమ శిక్షణ యిప్పుడు అమలులో లేదు. కనుక, బోధించే ఆచార్యులవారూ, బోధింపబడే శిష్యులూ యథేచ్ఛగానే ప్రవర్తిస్తున్నారు. ప్రదర్శించవచ్చునన్న ఫిల్ములను సందర్శించకూడదనుట ఆచార్యులవారి అవ్యక్తము.

*   *   *

శ్రీ వి. వి. వి. సూర్యనారాయణ—సింగవరం.

సప్తసముద్రము లంటారు. అవి అసలు ఉన్నవా? వాటికి ఏమైనా పేర్లుగలవా ?

—సాధారణంగా పెద్దబాలశిక్షలో కన్పించే సప్తసముద్రాల జాబితా

(1) ఉప్పుసముద్రం
(2) చెఱుకు సముద్రం
(3) కల్లుసముద్రం
(4) పాలసముద్రం
(5) నెయ్యిసముద్రం
(6) పెరుగు సముద్రం
(7) నీటిసముద్రం.

సప్తసముద్రములంటే యివి కావు.

గంగా సింధునదీ మైదాన ప్రదేశాలలోకి ఆర్యులు వచ్చి స్థిరవాసులైన కాలమందు, "సప్తసింధు" అనే పేరుతో సింధునదియొక్క ఉపనదులు ఏడు ఉండినట్లుగా వ్యవహరించిరి. సప్తసముద్రములను దాటివెళ్లాడు అంటే "సప్తసింధు"అనగా సింధునదియొక్క ఏడు ఉపనదులను దాటివెళ్లడం అని అర్థం - "సింధు" అనే శబ్దానికి సంస్కృతంలో "సముద్రం" అనే అర్థం కూడా ఉంది. అందువల్ల "సప్తసింధు" అనే మాటకు సప్తసముద్రాలు అని అన్వయించడమున్నూ, ఆసముద్రాలకు నామకరణం చేయడమున్నూ సంభవించింది.

*   *   *

శ్రీ జే. తిరుపతయ్య—కర్నూలు.

డాక్టరు అనే బిరుదు వైద్యవృత్తియందు లేనివారి పేరుముందర ఉండుటకు కారణమేమి ?

—"విద్" అనే సంస్కృతధాతువునకు "తెలిసికొనుట" అని అర్థం. "వైద్యుడు" అనగా పండితుడు లేదా "తెలిసినవాడు" అని అర్థం. కొన్ని ప్రాంతాలలో వైద్యుణ్ని "పండితుడు" అంటారు. బెంగాలులో "కవిరాజు" అనికూడా అంటారు. "డాక్టరు" అనే ఇంగ్లీషుమాటకు వేత్త అని అర్థం. ఏ శాస్త్రంలోనైనను పెద్ద పండితుడైనవానిని "శాస్త్రవేత్త" "వేత్త" అంటారు. ఇంగ్లీషులో "వేత్తను" "డాక్టరు" అంటారు.

*   *   *

శ్రీ వై. చంద్రరావు—ఖర్గపూరు.

నేడు మన భారతీయ శాంతి చిహ్నము అశోకుని కాలంనాటి ధర్మచక్రముతో కూడిన మూడు సింహములుగల స్థూపం. దాని పైనున్నవి మూడు సింహములు. పౌరుషంగల క్రూరజంతువులు కదా అవి ? నేడు ఆ స్థూపం శాంతికి చిహ్నమెలాగయింది ?

—సింహంవంటి క్రూరమృగముయొక్క పౌరుషం మనుష్యులలో ఉంది. అటువంటి రోష పౌరుష చిత్తప్రవృత్తిగలవాళ్లుకూడా ధర్మచక్రమునకు అనగా ధర్మనియమములకు బద్ధులై ఉండడమే శాంతికి సూచన.

*   *   *

శ్రీ బాబూరావు—కర్నూలు.

మన దేశంలో అనాథులు ఎక్కువ వుండుటకు కారణమేమిటి ? ఇతర దేశములలో లేకుండుటకు కారణమేమిటి ?

—అన్నాతురు లెక్కువైన దేశంలో అనాథు లెక్కువవుతారు. భారత దేశం చాలా కాలం అనగా నిన్నమొన్నటివరకు పరరాజుల ఏలుబడి క్రింద పీల్చి పిప్పిచేయబడి, అనాథస్థితిలో ఉండడంచేత, అనాథు లెక్కువైనారు—ఇటువంటి దుర్దశ లేని యితరరాజ్యాలు మహర్దశలో ఉన్నాయి.





భాస్కర్ ప్రొడక్షన్స్ "బ్రతుకు తెరువు" సెట్ మీద నిర్మాత భాస్కరావు, దర్శకుడు, రామకృష్ణ కెమేరావంకే చూస్తున్నారు. నటులు నాగేశ్వరావు రంగారావు లిద్దరూ డైలాగ్స్ కూడ బలుక్కుంటున్నారు.



కొడుకును కొడుతున్నట్టు నటిస్తూ, తలగడను కర్రతో బాదుతూ వుండటం భార్య కనిపెట్టింది. ఎందుకు నవ్వుతోందో తెలియక శివరాం తెల్లబోతున్నాడు నాయిల్లులో"లో రాజకుమారి, నాగయ్య.

## ☆ సింహావలోకనం ★

(47-వ పేజీ తరువాయి)

కత్వం లో ఈ చిత్రం పూర్వంకంటె ఎక్కువ "రియలిజమ్" సాధించగలిగింది. 1952 చిత్రాలమీద "షావుకారు" ప్రభావం కొంత ఉన్నది. ముందు ముందు దాని ప్రభావం ఇంకా ఎక్కువ అవుతుంది కూడా.

మనదేశంలోని ఇతర భాషా చిత్రాలు కూడా మన చిత్రాలు పొందిన పరిణామమే పొందాయి, పొందుతున్నాయి. మన చిత్రాలు ఏ ఇతర భాషాచిత్రాలకూ తీసిపోయేవి కావు. దక్షిణదేశ చిత్రాలకంటె, చాల బొంబాయిచిత్రాలకంటె మన చిత్రాలు మెరుగే. ముఖ్యంగా, బొంబాయి నిర్మాతలవలె మనవారు హాలీవుడ్ కథలను ముక్కకి ముక్క దించివెయ్యకపోవటం, స్టంటుచిత్రాల జోలికి వెళ్ళకపోవటం, కొంతవరకైనా జాతీయతను పాటించటం సంతోషించదగిన విషయం. అయితే కొత్త రాహులవలె మనవారు చారిత్రక చిత్రాలను ముట్టుకోకపోవటం లోపమేనని చెప్పాలి. బి. ఎన్. రెడ్డిగారు తీసిన "మల్లీశ్వరి" విజయనగరరాజులనాటి శిల్పవాతావరణాన్ని జయప్రదంగా ఉపయోగించుకున్నది. కాని "మల్లీశ్వరి" ని ఉజ్వలమైన ఒక ప్రేమగాథగా అంగీకరించగలం గాని "చారిత్రక శక్తుల సంఘర్షణను ప్రతిబింబించేది" గా అంగీకరించలేము. చారిత్రకచిత్రం తీయటం జానపదచిత్రం తీయటం కన్న కష్టమైనది: ధనవ్యయం దృష్ట్యా కాదు; చెయ్యవలసిన చారిత్రక పరిశోధన, ఎత్తుకోవలసిన కాన్వాస్ చాలా వుంటుంది. చారిత్రక రంగంలో మన నిర్మాతలు చెయ్యవలసినది చాలా వున్నది.

మొత్తానికి గడిచిన ఇరవై రెండేళ్ళలోను తెలుగు చలనచిత్రకళ చాల దూరం వచ్చింది. ఈరోజున ప్రేక్షకులు పూర్వపు చిత్రాల పద్ధతిలో సినిమాలు తీస్తే చూడ నిరాకరిస్తున్నారు. గత సంవత్సరం విడుదల అయిన చిత్రాల్లో "పెళ్లి చేసిచూడు", "దాసి" చిత్రాలు మాత్రమే మంచి ఆర్థిక విజయం సంపాదించినట్లు చెబుతున్నారు. మిగతా చిత్రాల్లో ఎక్కువభాగం బాగా దెబ్బ తిన్నాయనీ, ఏ అయిదారుచిత్రాలో ఒకమాదిరిగా నడిచాయనీ చెబుతున్నారు. దెబ్బ తినటానికి, చిత్రాలు ప్రేక్షకుల అభిరుచికి తగినట్లు లేకపోవట మొక్కటే కారణం కాదు గాని, అది ప్రబల కారణమే. ప్రజల అభిరుచిని అభివృద్ధి చేసేది సినిమా లొక్కటే కాదుగదా! విద్యావ్యాప్తి, సారస్వతం, తదితర కళలు, ముఖ్యంగా ఇప్పుడు జరుగుతున్న సంఘటనలు, జీవితానుభవాలు ఇవన్నీ ప్రజల అభిరుచిని, సంస్కారాన్ని తయారుచేస్తాయి. సినిమాలు ఈ అభిరుచిని ఆధారం చేసుకొని దాన్ని పెంపొందించేందుకు ప్రయత్నిస్తేనే కృతకృత్యం కాగలవు. ★



"నాయిల్లు"లో ఆఖరి ఘట్టం గిరిజ, గోపాలకృష్ణ, రామశర్మ, నాగయ్య, రాజకుమారి

# సినిమావార్తలు

నాగూర్ సినీ ప్రొడక్షన్సువారు "అమరకవి" అనే తమ తమిళ చిత్రం తెలుగులోకి డబ్ చేస్తున్నారు. ఇది ఫిబ్రవరిలోనో, మార్చిలోనో విడుదల చేయాలనుకుంటున్నారట. త్యాగరాజభాగవతార్, రాజకుమారి, పి. కె. సరస్వతి, లలిత, పద్మిని, ఎన్. ఎస్. కృష్ణన్, టి. ఎ. మధురం మున్నగువారు నటిస్తున్నారు. డైరెక్టరు నాగూర్. తెలుగులో మాటలు, పాటలు కోపల్లె రమణారావు రాశారు. సంగీత దర్శకుడు పాండు.

*   *   *

వాహినీవారి "పెద్దమనుషులు" షూటింగ్ రేవతీ స్టూడియోలో చురుకుగా సాగుతున్నది. ఒక ఊరికి కొత్తగా ఎన్నికైన ఛైర్మన్‌గారికి (గౌరీనాథశాస్త్రి), పురమందిరంలో సన్మానం జరగటం వగైరా తతంగం ఇటీవల షూట్ చేయబడింది. అయిదుగురు పెద్దమనుషుల పాత్రలను గౌరీనాథశాస్త్రి, లింగమూర్తి, వంగర, ఎ. వి. సుబ్బారావు, కుటుంబరావు ధరిస్తున్నారు. శ్రీరంజని, రేలంగి, పద్మావతీదేవి, జయలక్ష్మి, రామచంద్రకాశ్యప మున్నగువారు ఇతర పాత్రలు ధరిస్తున్నారు.

*   *   *

ఈ నెల 11 వ తేదీన మద్రాసు, బొంబాయిల ప్రముఖ సినిమా తారలు మద్రాసు, పీపుల్స్‌పార్కు స్టేడియంలో క్రికెట్ ఆడనున్నారు. దక్షిణభారత సినీ టెక్నీషియన్ల సంఘం ఈ ఆట ఏర్పాటు చేసింది. దీనిపై వచ్చే ఆదాయంలో కొంత సినీ టెక్నీషియన్ల సహాయనిధికీ, కొంత తమిళనాడు తుపానుబాధితులకూ ఇవ్వబడుతుంది. ఈ క్రికెట్ ఆటకు మద్రాసు గవర్నరు శ్రీప్రకాశ పోషకులుగా వుంటారు. మద్రాసు జట్టులో సూర్యకుమారి, అంజలీదేవి, కృష్ణకుమారి, వైజయంతీమాల, కుమారి కమల, లలిత, పద్మిని, పి. కె. సరస్వతి, రంగారావు, నాగేశ్వరరావు, శివరావు, సహస్రనామం, బాలచందర్, శ్రీరాం, టి. ఆర్. రామచంద్రన్, రామచందర్, గణేశన్ ఉంటారు. బొంబాయి జట్టులో నర్గీస్, నళినీజయవంత్, నిమ్మి, బేగంపారా, నూతన్, బీనారాయ్, యశోధరకట్జూ, మోతీలాల్ రాజ్ కపూర్, దిలీప్‌కుమార్, దేవానంద్, ప్రేమనాథ్, దివాన్‌షరార్, జైరాజ్, కరన్‌దివాన్, ఆగా, ఓంప్రకాశ్ ఉంటారట.

*   *   *



'నాయిల్లు'లో శివరాం కూతురు 'లక్ష్మి'గా" గిరిజ

నాటక సినిమారంగాలలో సమాన ప్రసిద్ధి పొందిన బొంబాయి నటుడు పృథ్వీరాజ్ కపూర్ ఈ నెలలో తన నాటకబృందంతో సహా దక్షిణదేశం రానున్నారు. జనవరి 20 వ తేదీన ప్రారంభించి విజయవాడలో వరసగా అయిదు నాటకాలు ప్రదర్శిస్తారని తెలుస్తోంది. ఆతరవాత మద్రాసు వస్తారట. పృథ్వీరాజ్ నాటకాలలో 'దీవార్' 'శకుంతల', 'పఠాన్' మున్నగు నాటకాలు చాలా ఖ్యాతి గడించినవి. ★

# విశాలాంధ్రలో జనవరి 9 వ తేదీ విడుదల!

అవరిండియా వారి

# నాయిల్లు

నాగయ్య..రాజకుమారి
లింగమూర్తి..విద్యావతి
గిరిజ...రామశర్మ...

స్టూడియో
వాహిని & రేవతి

డైరెక్షన్..
నాగయ్య

రచన:
దేవులపల్లి కృష్ణశాస్త్రి, యడవల్లి లక్ష్మీనారాయణ



సంగీతం:
నాగయ్య, అద్దేపల్లి

కెమేరా:
రహమాన్

నృత్యం:
వెంపటి సత్యం

# ★ విచిత్ర వ్యక్తి ★

(34-వ పేజీ తరువాయి)

ర్థాలు, రంగులు—ఏది పడితే అది, భావన అనే శూన్యంలోంచి సృష్టిస్తుంది. మానవుడు సిల్కుదారం గూర్చి భావిస్తాడు; అది తయారు చేసేందు కొక యంత్రంగూర్చి భావిస్తాడు; ఎంతో శ్రమపడితేనే గాని యంత్రమూ, సిల్కుదారమూ తయారుకావు నేనో? తలుచుకోవటం, తయారుకావటం రెండూ ఒకేసారి జరుగుతాయి.

నేను ఒక పద్యం, ఒక రాగం, ఒక చదరంగం ఆట ఏది తలుచుకున్నా తక్షణం అది తయారైపోతుంది. నాది దివ్య మేధస్సు. దానికి అందని విషయం లేదు. నా దృష్టిని అరికట్టగలది ఈ విశ్వంలో లేదు. రాళ్లలోంచి అవతలికి చూడగలను. గాఢాంధకారం నాకు పట్టపగలు అవుతుంది. ఒక పుస్తకం తీసుకుంటే పేజీ తరవాత పేజీ చదవ నక్కర్లేదు. అట్టలోంచి చూశానంటే లోపలి విషయాలన్నీ ఒక్క క్షణంలో ఆకళించుకోగలను. ఆకళించుకున్నదాన్ని పదిలక్షల సంవత్సరాలకైనా మరిచిపోను. పక్షి, చేప, పురుగు ఏదీ కూడా నాకు తెలియకుండా రహస్యంగా ఏ పనీ చెయ్యలేదు. ఒక పండితుడు అరవయ్యేళ్ళపాటు శ్రమపడి నేర్చుకున్న విజ్ఞానాన్ని అతని బుర్రలోకి ఒక్క చూపు పోనిచ్చి అదంతా నాది చేసుకోగలను. అతడు తను నేర్చుకున్న విజ్ఞానం మరిచిపోవచ్చు. కాని అతని దగ్గిర్నించి కొట్టేసిన నేను మాత్రం మరిచిపోను.

బహుశా ఇప్పుడు కొద్దిగా నన్నర్థం చేసుకుంటున్నా వనుకుంటాను. చెబుతా విను. ఇందాక చెప్పిన ఏనుగు ఉందే! అది ఖర్మంచాలక చీమ అంటే ఇష్టపడివుండచ్చు; అంతే గాని చీమను ప్రేమించటం మాత్రం దానివల్లకాదు. ఏనుగు ఏనుగులనే ప్రేమించగలదు. దేవతలు దేవతలనే ప్రేమించగలరు. దేవతల ప్రేమ మహోన్నతంగా, మహావిశాలంగా, తేజోన్వితంగా ఉంటుంది. ఒకవేళ దేవతలు మానవుల్ని ప్రేమించటమే తటస్థిస్తే ఆ ప్రేమ మానవుల్ని భస్మీభూతంచేస్తుంది. ఊహు. మేము మానవుల్ని ప్రేమించలేము. వారంటే ఇష్టపడవచ్చు. నువ్వు, నీ మిత్రులిద్దరూ, ఫాదర్ పీటర్, నాకెంతో ఇష్టులయ్యారు. మీమీద ఇష్టం మూలంగానే మీ గ్రామస్థులకోసం ఈపనులన్నీ చేస్తున్నాను.

మీ గ్రామస్థులకి నేను చేసేది చెడుఅని నువ్వనుకుంటున్నావు. కాదు. నేను మంచే చేస్తున్నాను. మంచిఅని నీకు తెలియకపోవచ్చు. మీ మానవులకి ఏదిమంచి ఏదచెడ్డ అనేది తెలియదు. ఎందుకంటే వాళ్లు నాలాగా భవిష్యత్తులోకి చూడలేరు. నేను చేసిన పనులమూలంగా మీ గ్రామస్థులకి శుభమే చేకూరుతుంది. కొందరికి వాళ్ల జీవితకాలంలోనూ, మరికొందరికి వారితరవాత తరాల్లోను శుభం కలుగుతుంది. ఈ శుభానికి కారణం నేనని వారెవ్వరూ గ్రహించలేరు. అంతమాత్రాన అది శుభంకాకుండా పోదు. మీపిల్లలు మామూలుగా ఆడుకునే ఆట ఒకటుంది. ఇటుకలు తీసుకొచ్చి వాటిని వరసగా నుంచోపెడతారు. ఒక ఇటుకనుతోస్తేచాలు, అది తనపక్క ఇటుకను, అది తనపక్క ఇటుకను అలా ఒకదాన్నొకటి తోసుకుంటూ, చివరికన్నీ పడిపోతాయి. మానవజీవితం అలాంటిదే. శిశువు పుట్టగానే మొదటగా చేసేపని, తరవాత చెయ్యబోయే పనులన్నిటినీ నిర్ణయిస్తుంది. ఇటుకలన్నీ పడిపోవటానికి మొదటి ఇటుకపడటం ఎలా కారణమవుతోందో, అలాగే మానవుడు చేసేపనులన్నిటికీ అతడు మొదట చేసేపనే కారణమవుతుంది. నాలాగా భవిష్యత్తులోకి నువ్వుకూడా చూడగలిగితే ఒకమనిషికి జీవితంలో ఏమేమి జరగబోతోందో అంతా చూడగలవు. ఆమనిషి చేసిన మొట్టమొదటిపని తెలిస్తే చాలు, అంతా చెప్పివెయ్యచ్చు. దానికి తిరుగులేదు."

"అయితే మానవజీవితం ఎలా ఉండాలో శాసించేది దేవుడేనా?" అని అడిగాను.

"కాదు. మనిషిపరిసరాలు, పరిస్థితులే అతని జీవితం నిర్ణయిస్తాయి. మొదటిపని రెండోపనిని, మూడోపనిని అలా జీవితాంతంవరకూ చేసే అన్ని పనులనూ నిర్ణయిస్తుంది. ఒకవేళ ఎవడైనా తను

# విచిత్ర వ్యక్తి

చెయ్యవలసిన పనుల్లో ఒకటి చెయ్యలేదనుకో. ఉదాహరణకి ఒకమనిషి ఫలానారోజున, ఇన్నిగంటల ఇన్నినిమిషాల ఇన్నిసెకండ్లకి, ఒక నూతివద్దకు వెళ్లాల్సి ఉందనుకో. అతడు వెళ్లలేదనుకో. అతని జీవితం ఆసెకండునుంచే మారిపోతుంది. నూతివద్దకు వెడితే, అతడు చచ్చిపోయేలోగా చక్రవర్తి కాగలడు అనుకుందాం. నూతివద్దకు వెళ్లలేదు కనుక బిచ్చగాడై కష్టాలపాలు కావలసిరావచ్చు. మరొక ఉదాహరణ: కొలంబస్ అమెరికా కనిపెట్టాడు. అతడు ఏదో కారణంవల్ల ఏదోఒక చెయ్యవలసినపని చెయ్యలేదనుకో. దానివల్ల అతని జీవితమంతా మారిపోయి ఉండేది. ఏదో మారుమూల ఇటాలియన్ గ్రామంలో, మతగురువుగా ఉంటూ ఎవరికీ తెలియకుండా చనిపోయేవాడు. అమెరికా ఇంకా రెండువందల ఏళ్ళదాకా కనిపెట్టబడకుండా ఉండిపోయేది. ఈసంగతి నాకు తెలుసు. కొలంబస్ జీవితం నేను బాగా పరిశోధించాను. అతని జీవితానికి కొన్ని లక్షల గమ్యస్థానాలు ఉన్నాయి. ఇన్ని లక్షలమార్గాలలోను ఒక్క మార్గంలోనే అతడు అమెరికాకనిపెట్టడం తటస్థిస్తుంది. అతడు మరేమార్గం అనుసరించినా అమెరికా కనిపెట్టగలిగేవాడు కాదు.

మీరు చేసే పనుల్లో కొన్ని ముఖ్యమైనవనీ, కొన్ని ముఖ్యమైనవి కాదని మీరనుకుంటారు. కాని అన్ని పనులూ ఒకే ప్రాముఖ్యం కలవి. నువ్వివ్వాళ ఏమీ తోచక ఒక తూనీగను పట్టుకున్నావనుకో. రేపు ఒక సామ్రాజ్యం జయించావనుకో. రెండూ నీ జీవితవిధానాన్ని ఒకేవిధంగా తీర్చిదిద్దుతాయి. ఒకదానికంటె ఒకటి ఏమీ గొప్పది కాదు.

అయితే ప్రతిమనిషికీ ఇన్ని లక్షల గమ్యస్థానాలున్నప్పుడు తన ఇష్టమైనది ఎంచుకోవచ్చుగదా అనినువ్వంటావు. కాని అతడు చేరవలసిన గమ్యస్థానం నిర్ణయించేది అతడు కాదు; అతడు జీవితంలో మొట్టమొదట చేసిన పనే దాన్ని నిర్ణయిస్తుంది. ఒకవేళ ఫలానా పని చెయ్యకూడదని అనుకుంటాడనుకో. ఆ అనుకోవటాన్ని నిర్ణయించేది కూడా అతని మొదటి పనే. ఫలానా పని చెయ్యడనుకో. ఆ చెయ్యకపోవటాన్ని నిర్ణయించేది కూడా మొదటి పనే."

సైతాను చెప్పింది మహా భయంకరంగా తోచింది.

"అయితే మనిషికి స్వాతంత్ర్యం లేదంటావా?" అని విచారంగా అడిగాను.

"లేదు. తనంతట తను ఎన్నటికీ స్వతంత్రుడు కాలేడు. కాని నేను అతన్ని స్వతంత్రుడు చేయగలను."

ఆశతో తలెత్తి చూశాను.

"నేను మీ గ్రామస్థులనేకుల జీవిత గమ్యస్థానాలు మార్చేశాను," అన్నాడు.

అతనికి కృతజ్ఞత తెలపబోయాను. కాని ఏమనడానికీ తోచక ఊరుకున్నాను.

"ఇంకా కొన్ని మార్పులు చెయ్యదలుచుకున్నాను. లిజా బ్రాంట్ అనే పిల్ల నీకు తెలుసుకదా?"

"ఓ తెలియకేం? మా అమ్మ ఆ పిల్లనిగూర్చి ఎప్పుడూ చెబుతూ వుంటుంది. చాలా మంచిదట, ముద్దొస్తూ వుంటుందట. పెద్దదైతే మాంఛి అందమైన పిల్లగా తయారవుతుందని మా అమ్మ అంటూ వుంటుంది."

"ఆ పిల్ల భవిష్యత్తు మార్చేస్తాను."

"అంటే, బాగు చేస్తావని అర్థమా?"

"అవును, ఆ పిల్ల జీవితం బాగుచేస్తాను. స్నేహితుడు నికొలాస్ లేడూ? అతని భవిష్యత్తు కూడా మార్చేస్తాను."

"అంటే అతని జీవితం కూడా బాగుచేస్తావన్నమాటేగా?"

"అవును."

నా సంతోషానికి మేరలేదు. నికొలాస్ ఎంత గొప్పవాడైపోతాడో నని ఊహాగానం చేశాను. బహుశా సర్వసైన్యాధిపతి అవుతాడేమో, చక్రవర్తి దర్బారులో గొప్పపదవి సంపాదిస్తాడేమో నని భావన చేశాను. ఇలా ఆలోచిస్తుంటే సైతాను నాకేసి చిరునవ్వు నవ్వుతూ చూస్తున్నాడు. నా ఆలోచనలన్నీ సైతాను కనిపెడుతున్నాడని తెలిసి సిగ్గుపడ్డాను. మళ్ళీ ప్రారంభించాడు సైతాను :

"నికొలాస్ జీవితకాలం అరవైరెండేళ్లు."

"బలే," అన్నాను.

"లిజా బ్రాంట్ ఆయుస్సు ముప్ఫయ్ ఆరేళ్లు

కాని నేను వారిద్దరి జీవితాలు, ఆయుస్సులూ మార్చే స్తాను. ఇంకా రెండుంబావు నిమిషాల్లో నికొలాస్ నిద్రపోతున్నవాడల్లా మేలుకుంటాడు. వాన కురుస్తూండటం చూస్తాడు. మామూలుగా అయితే అతడు మళ్ళీ అటు తిరిగి దుప్పటి కప్పుకుని నిద్రపోవాలి. కాని నేను అతని కార్యక్రమం మారుస్తున్నాను. అతడు లేచి వానజల్లు పడకుండా కిటికీ తలుపులు మూసేస్తాడు. ఈ కొత్త పని చెయ్యటంమూలంగా అతని యావజ్జీవితం మారిపోతుంది. రేపుపొద్దున అతడు లేవవలసిన సమయంకంటె రెండు నిమిషాలు ఆలస్యంగా లేస్తాడు..." అంటూ జేబులోంచి గడియారం పైకి తీశాడు సైతాను. "ఆ, అదుగో నికొలాస్ లేచాడు. కిటికీ మూశాడు. మళ్ళీ దుప్పటి కప్పుకుని పడుకున్నాడు. అతనికి కొత్తజీవితం ప్రారంభమైంది."

ఊపిరి బిగపట్టి సైతాను మాటలు వింటున్నాను. ఏదో భయంతో వొళ్లు గగుర్పొడిచింది.

"ఆ కొత్తజీవితం ఏమిటంటావా? చెబుతా విను. మామూలుగా అయితే, అంటే, ఇందాక నికొలాస్ లేచి కిటికీ తలుపు మూయకుండా ఉంటే, నేటికి పన్నెండవరోజున అతడు లిజా బ్రౌంట్‌ను రక్షించి ఉండేవాడు. లిజా బ్రౌంట్ ఆ రోజున నదిలో మునిగిపోతూ వుంటుంది. నికొలాస్ సరిగ్గా పదిగంటలనాలుగు నిమిషాలకి అక్కడికి వచ్చి తనుకూడా నదిలో దూకేవాడు. తేలికగా లిజా బ్రౌంట్‌ను రక్షించేవాడు. కాని ఇప్పుడు నేను చేసిన మార్పుమూలంగా అలా జరగదు. నికొలాస్ కొన్ని సెకండ్లు ఆలస్యంగా అక్కడికి వస్తాడు. అప్పటికే లిజా బ్రౌంట్ ఆఖరిదశలో వుంటుంది. నికొలాస్ నదిలో దూకి ఆమెను వొడ్డుకి లాక్కురాబోతాడు. కాని ఇద్దరూ కలిసి మునిగి చనిపోతారు"

"ఓ సైతాన్! సైతాన్! అలా వద్దు. వాళ్ళని రక్షించు. చచ్చిపోనివ్వకు. నికొలాస్ చనిపోతే నేను భరించలేను. అతడు నా స్నేహితుడు. పుట్టినప్పటినించీ కలిసి మెలిసి ఆడుకున్నాం. అతడు లేకపోతే భరించలేను. లిజా బ్రౌంట్‌ను కూడా రక్షించు. ఆమె తల్లి గతి ఏమవుతుందో ఆలోచించు," అని రుద్ధకంఠంతో అరిచాను. నేనెంత మొత్తుకున్నా సైతాను చలించలేదు.

"నేను చెప్పేది పూర్తిగావిను, థియొడోర్! నేనిలా మార్చకపోతే నికొలాస్ లిజాబ్రౌంట్‌ను రక్షించి వుండేవాడు. కాని నీళ్ళలో నానటంమూలంగా అతనికి జలుబుచేసేది. తరవాత మీమానవజాతికి మామూలుగావచ్చే ఆటలమ్మవచ్చేది. దాని ఫలితాలు జీవితాంతమూ ఉండేవి. నలభై ఆరేళ్ల పాటు పక్షవాతంతో, చెవిటివాడై, మూగవాడై, గుడ్డివాడై, అహోరాత్రాలు మృత్యువు నాహ్వానిస్తూ, దేవుణ్ణి ప్రార్థిస్తూ మంచానపడి తీసుకునేవాడు. తెలిసిందా? ఈ జీవితం వచ్చేట్టు మళ్లీ వెనక్కి మార్చమంటావా?"

"వద్దు, వద్దు ఈదీర్ఘవ్యాధిగ్రస్త జీవితంకంటే నదిలో మునిగి చనిపోవడమే మేలు," అన్నాను.

"నేను చెప్పలా? నికొలాస్ జీవితానికి గల లక్షలక్షల గమ్యస్థానాల్లో, ఏదీకూడా కోరదగినంత మంచిది లేదు. అవన్నీ రోగాలతోనో, కష్టాలతోనో నిండివున్నాయి. నేనతని జీవితాన్ని ఇందాక మార్చకపోతే లిజాబ్రౌంట్‌ను రక్షించటం, తత్ఫలితంగా నలభై ఆరేళ్లపాటు మంచానపడి తీసుకుతీసుకు చావటం జరిగేది."

లిజాబ్రౌంట్‌ను చనిపోకుండా బతకనిస్తే ఏం జరిగేదో అని లోపల అనుకున్నాను. నా ఆలోచనకు సైతాను సమాధానమిచ్చాడు:

"నదిలో మునిగినందువల్ల ఆమెకూడా పదేళ్ళ పాటు రకరకాల జబ్బులతో బాధపడేది. తరవాత పంథొమ్మిదేళ్లపాటు వ్యభిచారిణిగా ఘోరమైన, అవమానకరమైన జీవితం గడిపేది. చివరికి ఉరిశిక్షకు పాల్పడి మరణించేది. పన్నెండురోజుల్లో చనిపోవటం మంచిదంటావా? లేక అవమానభారంతో జీవించటం మంచిదంటావా?"

"నువ్వు చేసిందే మంచిది," అన్నాను.

"ఫాదర్ పీటర్ కేసు విచారణకు రాబోతున్నది. అతన్ని విడుదల చేస్తారు. అతడు నిర్దోషి అని బోలెడంత ఋజువు దొరుకుతుంది. కేసు కొట్టేస్తారు."

"అదెలా జరుగుతుంది?" అని అడిగాను.

"నాకు తెలుసు, జరుగుతుంది. అతని మిగిలిన జీవితం సౌఖ్యవంతంగా గడిచిపోతుంది."

ఫాదర్ పీటర్ జీవితం సౌఖ్యవంతం కాగలదని

## విచిత్ర వ్యక్తి

సంతోషించాను. జ్యోతిష్కుణ్ణిగూర్చి అడుగుదామనుకున్నాను. సైతాను సమాధానమిచ్చాడు:

"జ్యోతిష్కుడికి మామూలుగా అయితే చాలా దీర్ఘజీవితమే ఉంది. బోలెడు కష్టాలుపడతాడు. కాని అతని జీవితంకూడా మార్చేస్తాను. అతనికి హాని చెయ్యాలనే ఉద్దేశం నాకు లేదు. అతడెంత చెడ్డవాడైనా అతన్ని కూడా బాగుచేద్దామనే అనుకుంటున్నాను. బహుశా అతడు త్వరలో దహనం అయ్యేట్టు చేస్తాను."

బాగుచెయ్యటమంటే సైతాను అభిప్రాయం తగలపెట్టడమన్నమాట. అతడు దేవత. దేవతలకు ఏది మంచి, ఏది చెడ్డ అనేది లేదు. మన మంచిచెడుగులతో వాళ్ళకి సంబంధం లేదు.

సూర్యకాంతి హాయిగా, మృదువుగా మమ్మల్ని స్పృశిస్తోంది. నేను చెయ్యి జాచాను.

"సైతాన్! నా చేతిమీద సూర్యకాంతి పడుతున్నది. దాన్ని మధుపాత్రగా మార్చు," అని అడిగాను. క్షణంలో నా చేతిలోకి మధుపాత్ర వచ్చింది.

"దాన్ని బద్దలుకొట్టు," అన్నాడు.

బద్దలుకొట్టాను. బద్దలైంది.

"చూశావా? ఈ మధుపాత్ర మాయవస్తువు కాదు, నిజమైనది. మీ గ్రామస్థులు ఆ ఇత్తడి బంతులు మాయవనుకున్నారు. వాటిని ముట్టుకోటానికి భయపడ్డారు. ఎంత చిత్రమైన జాతోయ్ మీది? సరే. ఇక పోదామా? నాకు వేరేచోట పనుంది. నిన్ను నీ పక్కమీద పడుకోబెడతాను."

మరుక్షణంలో నేను నా పక్కమీద పడుకుని వున్నాను. సైతాను వెళ్ళిపోయాడు. దూరంనుంచి, వానచినుకుల చప్పుడుగుండా అతని కంఠం వినిపించింది: "సరే. సెప్పీతో చెప్పు. నికోలాస్‌తో చెప్పద్దు. ఇంకెవరికీ కూడా చెప్పకు," అన్నాడు.

నేను అప్పుడే మనసులో అనుకుంటున్నదానికిది సమాధానం.

(ఇంకా వుంది)

## మల్లినాధసూరి

(37-వ పేజీ తరువాయి)

కును ఆప్యాయంగా రెండు చేతులా పట్టి ప్రాగేడు. వెంటనే అతనిలో చెప్పలేని మార్పు వచ్చేసింది. అతని నోటిగుండా కవిత్వం వెల్లువలై ప్రవహించింది.

"జ్ఞానానంద మయం దేవం
నిర్మల స్ఫటికాకృతిం।
ఆధారం సర్వ విద్యానాం హయ
గ్రీవ ముపాస్మహే॥" అని ఆ హయ

గ్రీవ స్వరూపుడైన విష్ణుమూర్తిని స్తుతించాడు. ఆయన అనుగ్రహం వల్లనే అతనికి సకల శాస్త్రాలు ఒక్క రోజులో వచ్చేశాయి. గురువుగారివద్ద శెలవు తీసికొని ఊరూరా తన పాండిత్యం ప్రదర్శిస్తూ కొన్నాళ్ళకి అత్తగారి వూరు వచ్చాడు. ఇక్కడ యితని భార్య, భర్త తన మాటలకు కోపగించి వెళ్ళిపోయాడని తెలిసికొని పశ్చాత్తాప పడి ఎప్పటికైనా తిరిగి వస్తాడనే ఆశతో, బాటసారు లందరికీ భోజన సదుపాయము చేస్తూ, ఆ వచ్చే బాటసారుల్లో భర్త ఉన్నాడేమో నని పరీక్షిస్తూ ఉండేది.

"చివరికి ఒకనాడు మల్లినాధుడు కూడా బాటసారులతో పాటు భోజనానికి వచ్చాడు. భార్యను గుర్తుపట్టేడు. కాని పెద్దవాడై మార్పు చెందిన భర్తను ఆమె మాత్రము వెంటనే గుర్తించలేక పోయింది. భోజనా లవుతున్నాయి. చారు పోసేరు. దానిలో ఉప్పు తక్కువయింది. అందుకు అందరూ ఊరుకున్నారు కాని, మల్లినాధుడు మాత్రం "పలాశ కుసుమోయధా; లవణేన వినాయఃధారసః" అన్నాడు. దానితో ఆ యిల్లాలు అతన్ని పరకాయించి చూసి గుర్తుపట్టి వెంటనే తనని క్షమించమని కాళ్ల మీద పడ్డది.

"భార్యతో సహా తన తండ్రి దగ్గరకు వెళ్ళి తన పాండిత్యము ప్రదర్శించాడు. తండ్రి ఎంతో సంతోషించి దీవించాడు. కొన్నాళ్లకి మల్లినాధుడు కాళిదాస మహాకవి వ్రాసిన కావ్యాలకు వ్యాఖ్యానాలు రచించాడు.

"చూశావా! కాళిదాసు అంతటి కవి వ్రాసిన కావ్యాలనే వ్యాఖ్యానించాడంటే ఎంత గొప్ప పండితుడో!" అనినే కథ చెప్తుంటే మా తమ్ముడు నోరు తెరుచుకు వింటూ "అక్కయ్యా! నాక్కూడా ఆపద్యం నేర్పవే. రేపటి నుంచీ నేను కూడా రోజూ హయగ్రీవుని స్మరిస్తా - పాఠాలు బాగా వస్తాయేమోను" అని నాచేత ఆశ్లోకం ఒకటికి రెండుసార్లు చెప్పించుకొని నిద్రకి ఉపక్రమించాడు.

Edited Printed & Published by S. Sambhu Prasad at the Andhra Patrika Press, 7, Thambu Chetty St Madras



పంచతంత్రం

# మిత్రలాభం

కర్త... విశ్వాత్ముల నరసింహమూర్తి
























కొంతకాలమీ విధమున గడువగ- ఉభయుల మైత్రీ సుస్థిరమైనది















